# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 1 రాజమహేంద్రవరము 1-8-1978 సంచిక 19

—* ఈ సంచికలో *—



16—8—78 సంచికలో ప్రకృతి విలాసముల క్రొత్తలోకము, ఇందుమతీ పరిణయము - కాళిదాస ప్రభావము, అలంకార శాస్త్రంలో, ప్రక్రియా ప్రయోజనాల ప్రాధాన్య పరిణామం మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# ఔద్దేశిక నవల (Novel of Ideas)

డా॥ ఉప్పలపాటి శ్రీరామమూర్తి.

ఆధునిక తెలుగు సాహిత్యంలో చలం విశ్వనాథలు కాల్పనికవాద ప్రభావితులు. కాల్పనికవాద లక్షణం *అయిన ప్రేమ-ప్రణయతత్త్వం విషయంలో వీరిద్దరి దృక్పథాలు ఉత్తరదక్షిణ ధ్రువాలు. చలం సంప్రదాయ బద్ధమయిన వైవాహిక వ్యవస్థపై దెబ్బతీసే విధంగా స్త్రీకి లైంగికమయిన స్వేచ్ఛ వుండా లంటాడు. ప్రణయతత్త్వ పరంగా స్త్రీ స్వేచ్ఛావాదాన్ని ప్రచారంచేసిన కాల్పనిక తీవ్రవాది చలం. ఆధ్యాత్మిక బలంతో ముడిపడియున్న హైందవ సంప్రదాయ నిష్ఠమయిన వైవాహిక బంధం పరమ పవిత్రమయిందని,నిజమయినప్రణయతత్త్వంవివాహంలోనే వుంటుందని నిరూపిస్తూ నవలలు వ్రాసిన కాల్పనిక వాది విశ్వనాథ సత్యనారాయణ. చలం విశ్వనాథ గారలు తమ ఉద్దేశాలను (ideas) కొన్నింటిని ప్రధానంగా చెప్పదలచి నవలలు రచించారు. ఉద్దేశాలలో వీరిద్దరికీ భిన్నాభిప్రాయం వున్నప్పటికీ వీరిద్దరి దృష్టిప్రధానంగా కాల్పనిక వాదం చేత ప్రభావితం అయింది. వీరిద్దరి నవలలు కాల్పనిక వాద ప్రభావానికి లోనయ్యాయి. ఈవిధంగా కాల్పనికవాద ప్రభావితమయిన ఆధునిక తెలుగు నవల ఉద్దేశ ప్రధాన నవల (novel of ideas) గా రూపం దిద్దుకుంది.

చలంగారి అమీనా, దైవమిచ్చిన భార్య నవలలు, విశ్వనాథవారి చెలియలికట్ట, ఏకవీర నవలలు ఉద్దేశప్రధానమయిన రచనలు. వీనిని విమర్శనాత్మకంగా పరిశీలనచేసి వాటి ఔద్దేశికప్రాధాన్యాన్ని ఇక్కడ గుర్తించడం జరుగుతుంది.

అమీనా :-

తెలుగుదేశపు సాంఘికపరిణామంలో గుడిపాటి వెంకటచలం వ్యక్తిత్వ సాహిత్యాలకు ఒక విశిష్టమయిన స్థానం వుంది. స్త్రీ జనోద్యమానికి కంకణం కట్టుకున్న వీరేశలింగం పంతులుగారు, రఘుపతి వెంకటరత్నం నాయుడుగార్ల ప్రభావం చలంపై విశేషంగా పడింది. స్త్రీవ్యక్తిత్వపు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలపై శక్తిమంతమయిన రచనలుచేసి తెలుగు పాఠకలోకానికి చలం కనువిప్పు కలిగించాడు. ముఖ్యంగా చలం ప్రతిపాదించిన స్త్రీ-కేవలం స్వేచ్ఛ(Absaolute Freedom) - లైంగిక స్వేచ్ఛ (sexual freedom) - సిద్ధాంతం వైవాహిక వ్యవస్థకే ఒక గొడ్డలిపెట్టుగా పరిణమించింది. తెలుగుప్రజా జీవితంలో అలజడిని లేపింది.

చలం జీవితంపై బ్రహ్మసమాజ ప్రభావం పడింది. బ్రహ్మసమాజపు సంస్కరణలు; కులచిహ్నాలు తీసివేసుకోవడం, కులభేదం లేకుండా భోజనాలు చేయడం, స్త్రీస్వాతంత్ర్యం,విగ్రహారాధన చెయ్యకపోవడం. చలం ఈ సంస్కరణలను చేపట్టడంతో సమాజానికి నవజీవనంపోసినట్లయింది. అన్నింటికన్నా స్త్రీ స్వాతంత్ర్యం చలాన్ని బాగా ఆకర్షించింది.

చలం 'స్త్రీ విమోచన' ప్రధానాంశంగా సాహిత్యాన్ని సృష్టించారు. 'స్త్రీకి కూడా శరీరం వుంది. దానికి వ్యాయామం ఇవ్వాలి. ఆమెకి మెదడు వుంది, దానికి జ్ఞానం యివ్వాలి. ఆమెకి హృదయం వుంది, దానికి అనుభవం యివ్వాలి' అని 'స్త్రీ' గ్రంథానికి వ్రాసుకున్న 'మొదటిమాట'లో స్త్రీవ్యక్తిత్వాన్నిగుర్తించాలని చలం తెలియచేస్తాడు. లైంగికజ్ఞానం (Sexual knowledge) స్త్రీ పురుషులిరువురకు చిన్నప్పటినుండి తెలియ చెప్పా లంటాడు. 'సెక్సు అంటే జీవితపు సూత్రం...జీవితం లేదు, మేము బతకడమే లేదు. అనుకొంటే ఎంతలాభమో, సెక్స్ ప్రోద్బలం లేదనుకుంటే అంతే అర్థం. ఈ ఆకర్షణ వుందని నిష్కపటంగా అంగీకరించి దాని నించి సౌఖ్యాన్ని సాధించిన వాళ్ళు ధన్యులు'. స్వేచ్ఛగా లైంగికానుభవం పొందడంలో సంఘనియాలనీ, నీతినిబంధనలనీ, 'చాటుగా, స్వార్థంగా, గిల్టీగా, apologetic గాకాక, సంఘం మీది అభిమానం వల్ల, మనసుమీది ప్రేమవల్ల ఎదిరింపగల ధీరులు అవసరం' అంటాడు చలం.

స్త్రీ బానిసత్వాన్ని గురించి చలం వ్రాస్తూ ఆధునిక యుగంలో గూడ స్త్రీ బానిసత్వం నుండి విముక్తురాలు కాలేకపోతూంది. బానిసత్వం అనేది స్త్రీకి సహజ లక్షణంగా వుంటూంది. అయితే పూర్వకాలం నాటిబానిసత్వానికీ, నేటి కాలంనాటి బానిసత్వానికీ స్వరూపంలో భేదంవుంది అంటాడు. 'పూర్వకాలపు స్త్రీ యెంత యిరుకైనా ఓనీతికి, తానను కున్న ధర్మానికి, భర్తా, బంధువులూ, సంఘం- వీటికి బానిస. ఈనాటి స్త్రీ తనకు తానేబానిస ... స్వేచ్ఛతో వొచ్చిన బాధ్యతలూ సమస్యలూ జీవితాల్ని పిండిచేస్తున్నాయి. ఎక్కడా శాంతి,సుఖమూ లేకుండా వున్నాయి ... పురుషుడి అధికారంనించి తప్పించుకుని పదవులకీ, డబ్బుకీ బానిస అయింది స్త్రీ. ఎంతయిరుకైనా ఆ పెళ్ళే నయమేమో అనే ఆలోచన వస్తోంది. కాని పెళ్ళికి వీరు వాంఛించే భర్త దొరకడు. ఏదో ఓభర్తతో తృప్తిపడలేరు. భర్తని

భార్యా, భార్యని భర్తా తమసాంఘిక ఆశలకి ఉపయోగించు కుంటున్నారు". ('స్త్రీ' ఇంకోసారి మళ్ళీ తప్పలేదు).

చలం దృష్టిలో సమాజం అబద్ధపు విలువలతో అసంబద్ధ రీతిగా నడుస్తూంది. 'డబ్బు మీద, అధికారం మీద, శరీర మనోబలాల మీద ఆధారపడని ఓలోకం వుండకూడదా? విజ్ఞానం, సౌందర్య పిపాస, ఆత్మీయత, ప్రేమ, ఈ విలువలు రాజ్యంచేసే ఓలోకం వుండకూడదా ?' అని ప్రశ్నిస్తాడు. అటువంటి లోకం కోసం ఎదురు చూస్తాడు. స్త్రీ ప్రేమ చలానికి ఒక మధురలాలస. స్త్రీ స్వేచ్ఛను కాంక్షించి, స్వేచ్ఛతోకూడిన ప్రేమకై తపిస్తాడు. జీవితంలో అతడాశించిన సంతృప్తిని పొందలేదు. 'స్త్రీ' ప్రేమలో కూడ అనేక అంతర్యాలు ఉన్నాయి. స్త్రీని స్వార్థంగా సంకుచితంగా అనుభవించడంలో సుఖం చాల తక్కువ. తనని అర్పించుకున్న స్త్రీని ఆరాధించినకొద్దీ ప్రేమ ఉజ్జ్వలమౌతుంది.' ఇటువంటి స్త్రీకై అన్వేషణ జరుపుతాడు.

మైదానం, దైవమిచ్చిన భార్య నవలల్లో శారీరక సౌఖ్యానికి ప్రాధాన్యమిచ్చిన చలం, అమీనా నవలలో అంతఃకరణ ప్రవృత్తికి లొంగిపోయినాడు. అమీనా నవలలో సెక్స్‌కన్నా స్వేచ్ఛకే ప్రాధాన్యమిచ్చాడు. కేవలం స్వేచ్ఛను (absolute freedom) పొందాలంటే సర్వసంగ పరిత్యాగం చేసిన యోగులకే సాధ్యం అనినమ్మి, శరీరానికి అతీతమయిన ఆనందాన్ని ప్రేమని సాధించడానికి అరుణాశ్రమం చేరాడు.

ఉద్దేశప్రధానంగా చలం ప్రత్యేకంగా ఒక నవల అంటూ వ్రాయలేదు. సామూహిక చలంసాహిత్యం ఉద్దేశాత్మక ప్రధానమే. రచనలన్నింటిలోను చలం చిత్తవృత్తికి మూలం అయిన అతని అంతఃకరణ ప్రతిఫలించే అమీనా నవల విశిష్టమయింది. అమీనా నవల నాలుగు భాగాలు. మొదటి రెండు భాగాలు 1926 లోను, తర్వాతి రెండు భాగాలు 1942 లోనూ వ్రాయబడ్డాయి. నవల పూర్వార్థం వ్రాసిన చాలాకాలానికి ఉత్తరార్థం వ్రాయడం, పూర్వార్థం కంటె ఉత్తరార్థం పెంచి వ్రాయడం రచయిత పట్టుదలను, ఈ నవలకు అతడు ఇచ్చిన ప్రాధాన్యమును తెలుపుచున్నవి. ఇది స్థూలంగా పరిశీలిస్తే రచయిత ఆత్మకథగా వ్యక్తమౌతుంది.

చలం ఉద్దేశంలో జీవితం ఆనందానికి, సెక్స్ ద్వారాకలిగే ఆనందానుభవానికి, స్వేచ్ఛతో కూడిన సెక్స ద్వారా కలిగే ఆనందానుభవానికి, నిర్దేశమయింది. ఈ మూడు సోపానాలు చలం జీవితధ్యేయాలు. వీనినిసాధించడానికి చలం నిరంతరం అన్వేషణ జరిపాడు. ఒకదాని తర్వాత ఒకటిని సాధనామార్గంలో ఉపపత్తులు ఎన్నుకొన్నాడు. వాటినే ఆదర్శంగా పెట్టుకున్నాడు. స్వేచ్ఛను మాత్రం అతడు వాస్తవిక దృష్టితో సమన్వయించలేదు. లైంగిక స్వేచ్ఛాజీవితంలో ఎన్నో ప్రతిబంధకాలున్నాయి. స్వేచ్ఛతోకూడిన సెక్సుఅనుభవంలో వాస్తవికతకు అవకాశం తక్కువ. స్త్రీపురుషులలో స్వేచ్ఛ దొరికే అవకాశం ఒకే సమయంలో ఏర్పడటం అరుదు. స్త్రీ స్వేచ్ఛతో ఎన్నుకున్న, వాంఛించిన పురుషునికి ఆ స్త్రీపై సెక్స్ భావం ఏర్పడకపోవచ్చును. లేదా పురుషుడు కోరిన స్త్రీ అతణ్ణి నిరాకరింపవచ్చు. ఒకవేళ స్త్రీ పురుషులు సెక్స్‌ను స్వేచ్ఛగా అనుభవిద్దామను కొన్ననూ పరిసరవాతావరణం' సామాజిక పునీతికీ, ఆర్థికవ్యత్యాసాలకూ' మర్యాదా అంతస్థులకు లోనయి - అనుకూలింపక పోవచ్చును. విశ్వాసానికీ, తదాచరణ సాధ్యత్వానికీ ఎదురయ్యే ఘర్షణ చలంలో లేదు. స్వేచ్ఛలో సెక్స్ ద్వారాకలిగేఆనందమే ఆనందంఅని చలం విశ్వాసం. హేతుబద్ధమయిన ఈ విచికిత్సకు ఈ విశ్వాసం నిలబడకపోయినా, తాత్త్వికమయిన అన్వేషణపరంగా తన విశ్వాసాన్ని తాను దర్శించగల్గుతాడు చలం. ఒక యోగసాధనగా అది అతనిలో పరిణమించింది.

అమీనాను తన అంతఃకరణకు ప్రతీకగా చేసి చలం నవలను రచిస్తాడు. 'అమీనాని తలచుకొన్నప్పుడల్లా ఆహ్లాదకరమైన, ఉదయోత్సాహానికి తోడ్పడే పన్నీరుపువ్వు మార్దవమయిన పరిమళం జ్ఞప్తికి వొస్తుంది. అదే నాజూకు, అదే మొండితనం, అదే స్నేహం' నాజూకు, మొండితనం, స్నేహం రచయిత వ్యక్తిత్వాన్ని తెలుపుతాయి. అమీనాతో రచయితకున్న సంబంధాన్ని ఈ లక్షణాలే నిర్వచిస్తాయి.

అమీనా నవలలో రచయితే కథానాయకుడు. మొండిగోడల మధ్య స్నేహితుల కాలక్షేపంతో నవల ప్రారంభమవుతుంది. వీళ్ళతోబాటు 'సత్య' భర్తను వదలివచ్చి సరదాగా కాలం వెళ్ళబుచ్చుతూ వుంటుంది. రచయిత స్నేహితురాలు విమల, శ్రీమన్నారాయణ అనే అతనిచేత వంచింపబడి రచయితకు తెలీకుండా ఆత్మహత్య చేసుకుంటుంది. తనకు చెప్పివుంటే ఆమె సమస్యని పరిష్కరించేవాణ్ణి గదా అని రచయిత ఆందోళన చెందుతాడు. చలం ఆదర్శానికి స్వేచ్ఛాప్రణయిని విమల ఆత్మహత్య ఒక ఎదురుదెబ్బ. అమీనాను పరిచయం చేసుకుని తనవెంట ఇంటికి తీసుకవస్తాడు రచయిత. అతడి స్నేహితులకు, స్నేహితురాళ్ళకు అమీనా ఒక ప్రతిబంధకమౌతుంది. రచయిత స్నేహితురాలు ఒకడాక్టరు వస్తుంది. రచయితా, అతని స్నేహితులూ ఆమెతో కేళీవిలాసాలు జరుపుతారు. విషయలాలసత్వంలో మునిగిపోయిన రచయితకు కనిపించకుండా అమీనా అదృశ్యమౌతుంది. ఆ లేడీడాక్టరు వెళ్ళడంతో తిరిగి అమీనా దర్శనమిస్తుంది. శ్యామలను బలవంతంగా రచయిత తెచ్చుకుంటాడు. రచయిత

ఆమెతో గడపిన రాత్రి అమీనా దూరంగా వెళ్ళిపోతుంది. శ్యామల మోసం చేయడంతో రచయిత అంతఃకరణే జయిస్తుంది. అమీనా తిరిగి రచయితను చేరుకుంటుంది. శ్యామల చేసిన మోసం చలం సెక్స్ వేదాంతానికి కనువిప్పు కల్గిస్తుంది. 'స్వేచ్ఛని ప్రేమించే మనిషికి ఎన్ని బంధనాలు! గట్లు లేంది స్వేచ్ఛ లేదు. శ్రుతి లేంది సంగీతం లేదు. దేనికి స్వేచ్ఛ- దేనికీకాని స్వేచ్ఛ మహాభారం. ఇచ్ఛకీ స్వేచ్ఛకీ చాల దూరం' ఇక్కడ శ్యామలమీది వాంఛకీ అమీనా రూపంలోవున్న అంతఃకరణకీ మధ్య చాలదూరం ఏర్పడుతుంది. రచయిత అంతఃకరణను '... నే నేమైనాను అమీనా! ఎందుకు నడిచాను – చీకటి నిప్పులోకి, అందమైన కంచెలోకి! గుండె లేని గుబురు దగ్గరికి?' ప్రశ్నించుకుంటాడు. రచయితలో సెక్సంటే స్వేచ్ఛకే ప్రాధాన్యమిచ్చే ధోరణి వ్యక్తమౌతుంది. అంతఃకరణను అంటిపెట్టుకోడానికి పడే రచయిత ఆవేదన స్పష్టమవుతూంది.

అమీనా నవలలో రచయిత మానసిక పరిణామం మూడు స్థాయిలలో జరుగుతూంది. మొదటిది స్త్రీకి స్వేచ్ఛ కావాలన్న ఆదర్శం. విమలకు స్వేచ్ఛ వుంది. అయినా శ్రీమన్నారాయణ ప్రియునిచే మోసగింపబడింది. స్త్రీకి స్వేచ్ఛ వుండికూడా అది నిరుపయోగమయింది. పైగా అది ప్రాణాంతక మయింది. ప్రియునిమీది మమకారం వదులుకోలేక ఆమె చేసికొన్న ఆత్మహత్య పై ఆదర్శానికి అపవాద మవుతుంది. ఈ మోసం జరగడానికి, ఆదర్శం విఫల మవడానికి కారణాలు నీతి, మర్యాద, వ్యవస్థ అనేవి. ఈ మూటిలో చలం స్వేచ్ఛావాదం ఇమడలేకపోయింది. రెండవ ఆదర్శం అయిన సెక్సులో సంపూర్ణ స్వేచ్ఛ - స్త్రీపురుషులిద్దరికీ వుండాలన్న చలం ఆదర్శం చోటు చేసుకుంది. శ్యామలను గార్జన్యంగా ఆమె స్వేచ్ఛతో ప్రమేయం లేకుండా, ఆమెను స్వేచ్ఛగా అనుభవించాలని రచయిత అనుకోవడం, ఆమె అతణ్ణి మోసగించి పారిపోవడంతో ఈ రెండో ఆదర్శమూ బెడిసికొట్టింది. ఇక్కడ సెక్సుకీ, స్వేచ్ఛకీ మధ్య సంఘర్షణ జరగడం గమనించతగింది. మూడో ఆదర్శం అయిన సేచ్ఛా - అంతఃకరణ సామ్యం చలంలో స్థిరపడింది. మొదట్లో రచయిత సెక్సుకి ప్రాధాన్యం ఇవ్వాలనుకొని, తనలోని స్వేచ్ఛనుకోరే అంతఃకరణకు దగ్గరవడంతో, సెక్సంటే స్వేచ్ఛవైపు మొగ్గు చూపినవాడయినాడు. కేవలం స్వేచ్ఛకూ, తన అంతఃకరణానికీ అభేదాన్ని పాటించి ఆ రెండింటికీ తాదాత్మ్యాన్ని వహిస్తాడు. కేవలం స్వేచ్ఛను కోరడంతో రచయిత తన్ను తాను త్యాగం చేయాల్సి వస్తుంది. అంటే సెక్సు అనుభవానికి దూరం కావలసి వస్తుంది. అమీనా రచయితను జీవితం ఇవ్వమంటుంది. అంటే సర్వసంగ పరిత్యాగంతో రచయిత అన్వేషణసిద్ధి పొందుతాడు. ఈసందర్భంలో చలం వ్రాసుకున్న ఆత్మకథ 'చలం' లోని కడపటి వాక్యాలు ఉదహరించడం సముచితం. 'ఈశ్వరుడు స్త్రీని పురుషహృదయంలో బంధితుడైనాడు. ఆ బంధవిముక్తి అయితేగాని ఆపురుషుడికీ స్త్రీకిగూడ మోక్షం లేదు.' చలం సాధించిన అంతఃకరణ అన్వేషణ వైయక్తికమయింది. అమీనా నవల పూర్వభాగాల్లో వెలువరించిన భావాలు వైవాహిక వ్యవస్థపై దెబ్బతీసే విధంగా మనకు కనిపిస్తాయి. 'సుఖంగానూ నిర్మలంగానూ వాళ్ళు కాపరం చేయడం లేదు. సుఖంగావుంటే, మూలల్లోరిచూపుల వంక కళ్ళెత్తి చూడనే చూడరు. ఆబూజు గదుల్లో లేని పదార్థం నిర్మలత్వమే! శరీరాల్లోనూ, పనుల్లోనూ, మాటల్లోనూ, పక్కల్లోనూ, మనస్సుల్లోనూ, యెక్కడా లేవు-నిర్మలత్వమూ, కాంతీ, ఆనందమూ. అందుకనే అశాంతి వైవాహిక ప్రేమలో నిర్మలత్వం కొరవడుతుందనీ, అందుకనే ఆకర్షణలేని కుప్పజీవితాన్ని దంపతులు గడుపుతున్నారనీ చలం అంటాడు. నిర్మలత్వం లేనందువల్లనే దాంపత్య జీవితం అశాంతికి గురి అవుతూంది అని చలం అభిప్రాయం. విమలజీవితం నాశనం అవడానికి ఇటువంటి వైవాహిక వ్యవస్థకారణంఅంటూ, 'విమలని నట్టేటిలో వదలి.. ఒకరివేపు ఒకరం చేతులుచాచి కూడ అందుకోలేక, యీతవచ్చికూడా...సరక్షించలేక...యెప్పటికప్పుడు మతమూ అభిమానమూ...అడ్డై, ఒకరికి, వివాహ సముద్రంలో కలిపి మృత్యునక్ర దంష్ట్రలకి వొప్పచెప్పాను విమలను'

వైవాహిక వ్యవస్థలో స్వేచ్ఛకు తా[ావు] లేదంటాడు. స్వేచ్ఛను కోరే అమీనాని రచయిత భార్య తన్ని తరిమేస్తుంది. రచయిత భార్య సుబ్బులు వైవాహిక వ్యవస్థకు ప్రతినిధి. ఆమెకు స్వేచ్ఛను కోరే రచయిత అంతఃకరణం సహ్యంకాదు. ఆమె తరిమేసినఅమీనాని వెదుక్కుంటు రచయిత బయల్దేరతాడు. అమీనా అత డికి దొరకదు. అంటే వైవాహిక వ్యవస్థలో అంతఃకరణకు స్థానంలేదని చలం అభిప్రాయం. 'రోడ్డు మలుపు...సైద కాలువ. బురద. అస్తమించే సూర్యుడు కళ్ళల్లో చీకటి. అంతే అమీనా. జనానికి ఆఖరు నా చిన్న అమీనా. ఎదగని పువ్వు నాఅమీనా'- ఇవి నవల ముగింపు వాక్యాలు.

కేవలంస్వేచ్ఛ అనే రచయిత ఆదర్శం ఈలోకంలో 'ఎదగని పువ్వుల్లో' అంటే పసిపిల్లల్లోనే వుందని రచయిత భావం. మళ్ళీ అలాంటి అనుభూతి పొందాలంటే పసిపిల్లల మనస్తత్వంలాంటి సర్వసంగపరిత్యాగంచేసిన యోగులకే సాధ్యం. చలం దీని వెంటనడిచాడు. నడిచి నడిచి రమణ మహర్షి ఆశ్రమం చేరుకున్నాడు. అటువంటి కేవల స్వేచ్ఛానుభూతిని మహర్షి సాన్నిధ్యంలో పొందాలనే ఆశతో అన్వేషణంతో చలం మానసిక పరిణామం పొందాడు. ఈపరిణామం తాత్త్విక పుష్టికల్గినటువంటిది. తనను తాను చూచుకొనే ఆత్మాన్వేషణం అపరిణామం యొక్క పర్యవసానం. అహాన్ని (ego) చంపకుని, అందరిలో 'ఆత్మవత్ సర్వభూతాని' చూచుకునే పరిణామం పొందడంతో అన్ని సందేహాలూ నివృత్తి అయి అంతని లో ప్రశాంతి చోటు చేసుకుంటుంది. ప్రశాంతి తత్త్వమే చలం సాధించిన కేవలం స్వేచ్ఛానుభూతి.

# పది పద్యాల ఉపనిషత్తు

- శ్రీ జమదగ్ని.

'కవీనాం కవితైవ యోగః' అన్నారు పెద్దలు. శ్రీ విశ్వనాథ సిద్ధ పురుషుల యొద్ద దీక్షాశీలియై ప్రస్థానత్రయ శ్రవణం చేసిన మహాకవి. ఆయన తన కవిత్వాన్ని తపస్సుగా భావించి పరమార్థాని కుపయోగించుకున్న చరితార్థజీవి. అందుచేత ఆయన కవిత్వమంతా గురుముఖతః శ్రవణం చేసిన ఆత్మవిషయానికి మనన నిదిధ్యాసన రూపమైనదే. తత్త్వ విచారధారారూపమైన ఆయన రచనలలో ఆయన ప్రధానంగా మహాకవి కావడంచేత కవితా విషయక సద్యః పర నిర్వృతి హేతు సర్వ సౌందర్యాలూ ఆవిష్కృత మవుతూనే ఉంటాయి. ప్రధానంగా మహాయోగులైన శ్రీ శంకరుల కృతులలో ఎన్ని కవితా సౌందర్యాలు ఆవిష్కృతం కాలేదు? అది జాతి అదృష్టం. అలాగే ప్రధానంగా మహాకవులైన విశ్వనాథ వారి రచనలలో తత్త్వ విచారధార అనుస్యూతమై ఉండడం తెలుగు జాతి అదృష్టం!

ఈ 'పది పద్యాల ఉపనిషత్తు' మనకు యుద్ధకాండ సంశయ ఖండంలో లభ్యమవుతోంది. దీన్ని దర్శించిన ద్రష్ట అంగదుడు. హనుమన్మహాయోగి శిష్యశిఖామణి. వానరసైన్యాలు కోటను ముట్టడించి ప్రాకార నిర్భేదనానికి పట్టుదలతో ప్రయత్నిస్తున్న సందర్భంలో రావణుడు స్వయంగా మహామాయావి ఇంద్రజిత్తు ఇంటికివెళ్లి పరిస్థితి చెప్పి ధనుర్బాణ కవచాదు లందించి కొడుకును సజ్జునిచేసి వెళ్ళి పని సాధించుకు రమ్మని పంపించాడు. అతడు ఉత్తరద్వారాలు తెరిపించి రాక్షస సైన్యాలతో వెలువడి వానర సైన్యాల ప్రాకార భేదన ప్రయత్నాన్ని విరమింప చెయ్యాలనే దొమ్మియుద్ధాని కుపక్రమించాడు. ఆ ఆశయ మయితే నెరవేరిందికాని పేరు మోసిన రాక్షస వీరుల పతన మారంభ మయింది. వాడే వాడే ఇంద్రజిత్తు అని హనుమ చూపించాడు అంగదునకు. గురువును బ్రహ్మాస్త్ర బద్ధుణ్ణి చేసిన దుర్మార్గుడన్న కోపంతో అంగదు డాతనిని నిరోధించాడు. సముచిత పరామర్శ అయింది. అంగదుడు ఆ ఇంద్రజిత్తును రథ సమేతంగా ఆకాశానికెత్తి గిర గిరా త్రిప్పి కూలవేశాడు. అది ఎన్నో పల్టీలు కొట్టి కొట్టి రథ్యాశ్వ సారథి సమేతంగా చెక్కు చెదరకుండా యథాపూర్వ స్థితిలోనే నేల నిలిచింది. ముక్కలు ముక్కలయి విచ్చిపోవలసినది ఇలా ఎలాగున్నది! ఇంతకంటె మహామాయ ఇంకే ముంటుంది! ఈ సన్నివేశ బీజంనుండి ఆవిష్కృతమైందీ ఉపనిషత్తు.

అలయక యన్ని వేళలను
నన్ని స్థలంబుల నిండియుండగా
వలయున వెల్గు వెల్గుల స్వ
భావము నట్టిద దానిశక్తిలోఁ
దొలఁగుట నిండు ఓన్న యది
తోఁచని వస్తు వదేదొ పంచపం
చలఁబడి యడ్డువచ్చినఁ బ్ర
సారములేమియొ చిత్ర మయ్యెడిన్॥

ఎప్పుడు మాయ అనిపించిందో అప్పుడు మాయ అంటే ఏమిటి అని విచారణ ప్రారంభమైంది. దాన్ని పరమేశ్వరశక్తి అంటున్నాయి మన శాస్త్రాలు. 'మాయాం తు ప్రకృతింవిద్ధి మాయినం తు మహేశ్వరమ్.' ప్రకృతి రూపమైన ఆ శక్తి పరమేశ్వరునియందే యవ్యక్తమై ఉంటుంది. అది యవ్యక్తమై ఉన్నప్పుడు నిర్గుణ నిరాకార పరబ్రహ్మ తత్త్వంగానే ఉంటుంది. ఆ పరబ్రహ్మ కభిన్నమైన తచ్ఛక్తి యభివ్యక్తమై సగుణ పరబ్రహ్మగా భాసించి తన శక్తి తన అధీనమయియే ఉండగా ప్రపంచాకారాన్ని పొందడం జరుగుతుంది. ఇంత విశ్వమూ ఆ పరమాత్మయం దేకాంశమందే తోచి విశ్వ మున్నప్పుడూ లేనప్పుడూ కూడా పరమాత్మ నిర్వికారుడయ్యే ఉంటాడు. ఈ తత్త్వజ్ఞాన మంతా ఉన్న అంగదుడీ విచారణ చేస్తున్నాడు. సచ్చిత్సుఖ రూపుడైన పరమాత్మ దేశకాల బద్ధుడు కాడుగదా! దాన్నే వెలుగంటున్నాడు అంగదుడు.

ఇది రూపగుణక మైన తేజోభూతం కాదు. నిరింధన తేజ మంటారు దీన్ని. దీని స్వభావం సర్వగతమై ఉండడం. దీని కభిన్నమైన శక్తికే మాయ యని పేరు. ఆశక్తి పరమాత్మనుండి తొలగడం, నిండడం, వెలితికావడం వగైరా లేమీ తెలియబడవు. అట్టి శక్తి ఆ పరమాత్మ కధీనమై ఉండియే దాన్ని ఆచ్ఛాదిస్తోంది. ఇదే పరమాశ్చర్యకరమైన విషయం. ఈ తత్త్వ విచారణలోనికి అంగదుని మనస్సును దూకించింది ఇంద్రజిత్తు కల్పించిన మాయ. అతని రథాన్ని ఆ అంగదుడు త్రిప్పినట్లు త్రిప్పి కూలవేశాక అదిచెక్కు చెదరకుండా ఉండడం అసంభవం! అది పూర్వ మున్నట్లే నేలమీద నిలబడడం ఎలా సాధ్య మయింది? మొదటి నుంచీ లేని దున్నట్లుతోచే మాయా వస్తువయితేనే అది సాధ్య మవుతుంది. ఉన్నది తెలియబడడంలేదు. లేని దున్నట్లు

తోస్తోంది' సత్యదార్థాన్ని ఆచ్ఛాదిస్తున్న ఈ మాయ తత్త్వం ఏమిటి?

అక్కట! యెచ్చటం బడిన
నచ్చట నుండఁగ నైన వెల్గు లా
యొక్కెడి నుండియో మఱియు
నెచ్చటికో చనుదెంచు టేమి? యా
యొక్కడు దాని కడ్డమయి
యుండఁగ జాలుట యేమి? చీకటుల్
పిక్కటిలంగ నైన దగు
చెట్టు యదేటికి లోకమందునన్॥

దేశకాలముల కతీతమైన ఆ పరమాత్మ తేజం దేశకాల బద్ధమయి యొకచోటి నుండి మరొకచోటికి ప్రసరిస్తున్నట్లూ, దాన్ని యేదో యాచ్ఛాదిస్తున్నట్లూ తోస్తున్నది. ఇందువల్లనే లోకానికి ఈ చీకట్ల బెడద వచ్చిపడింది. ఈ బెడద లేకుండా ఉంటే బాగుండునుగదా!

ఆ వెలుఁగున్ సమస్తమున
యందున నుండఁగ మున్ను చీకల్
త్రోవలుకొట్టి దవ్వులకుఁ
దోలెనుగావలె వెల్గు కేకలన్
కైవస మావరించుకొని
కానలు కొండలు వెన్క పీటిగా
గావలుఁ డేగుదెంచి యొస
కంబున నెంతయు నైనఁ జేసెడిన్॥

పూర్వం వెలుగు అంతటా ఉంటూ ఉండగా వాటినుండే వెల్వడిన చీకట్లు ఆ వెలుగులదారు లడ్డంకొట్టి వెలుగులనే తరిమివేశాయి కాబోలును. దుష్టమైన ఈ చీకట్లు అడవులనూ కొండలనూ ఆశ్రయించుకుని వాటివెనుకదన్నుతో లోకానికెంత చీకాకునైనా కలిగిస్తున్నాయి.

చీఁకటిలేని వస్తువిది
చెన్నుగ నుండుట యెట్లు గల్గెనో
వేఁకటి తాల్చియే జనని
బిడ్డను దీనిని గాని కన్నదో
వాఁకిలి లేని యేగుహాను
వచ్చిన తత్ప్రథ మావతారమో!
తేఁకువ నూదివోలె నరు
దేరఁగ దబ్బన మాచుఁ దేలగా॥

అసలు వస్తువైన వెలుగులో ఈ చీకటి నేనేలేదు. తమసః పరస్తాత్ అంటున్నది శాస్త్రం. చీకటిలేని వస్తువది ఎట్లా కలుగుతోందో! అందులో నుండి ఈ చీకటి అనే బిడ్డను ఏ తల్లి కంటున్నదో? నిరవయవమైన ఆ పరమాత్మలో నుండి వాకిలిలేని గుహానుండి బయటపడ్డట్టు ఇది ఎలా వస్తున్నదో! సూదిలావచ్చి దబ్బనంలా తేలి మిక్కిలి ఇబ్బంది కలిగిస్తున్నది.

ఆ సూర్యుండును బెద్దమోసమున ఛా
యాదేవిఁ బెండ్లాడుగాఁ
జేసెన్ దానికిఁ బుట్టినట్టి ప్రజ యీ
చీఁకట్లునుం గావలెన్
మోసంబై చనుదెంచు చీఁకటుల ని
ర్మూలింపగా నేరఁడుం
జేసేతన్ దుదికేమి చీఁకటులు కాఁ
జేసెన్ నిశారాజ్యమున్॥

ఆపరమాత్మనుండి మాయ బయల్వెడలడానికి నిదర్శనంగానే ఛాయా సూర్య సంసారం కనిపిస్తోంది. సూర్యుడు పాప మెక్కడలేని మోహంతోనూ ఛాయాదేవిని పెండ్లాడాడు. వాళ్ళ సంతానమే ఈ చీకట్లు. తన బిడ్డలే అవడంచేత అవి ఎన్నెన్ని అఘాయిత్యాలు చేస్తున్నా వాటిని తొలగించడమే గాని సూర్యుడు చేసేతులా నిర్మూలించలేక పోతున్నాడు. చివరికా చీకట్లు బలిసి బలిసి నిశారాజ్యాన్ని అవే ఆక్రమించివేశాయి.

పేరిమి కొన్న భార్య కని
పింపక యున్ గనిపింపఁ జేసికో
నేరిమి వృక్షసంతతిని
నిర్మితి చేసెను దానివెంట నా
నారచనల్ గడంగె అల
నా మణి సంతతి చీఁకటుల్ నిరా
కారముగా జనించె గిరి
కందర మందరహస్స్థలంబులన్॥

ఇదెంత విచిత్రమైన సంసారమో, ఎంతో ప్రేమతో ఆ ఛాయను తాను వివాహమాడితే ఆమె తనకు కనిపించనే కనిపించదు. ఎట్లాగైనా ఆమెను కనిపింపచేసుకునేందుకే సూర్యుడు తెలివంతా ఉపయోగించి చెట్లను నిర్మించాడు. అప్పుడు ఛాయ పడసాగింది. కనిపించసాగింది. సూర్యుడు మురియసాగాడు. ఇక జరగవలసిన సమస్తమూ జరిగింది. ఈ దుస్సంతానం చీకట్లు విజృంభించాయి. వీటి నా తల్లి గిరి కందరాల్లో అతి రహస్య స్థలాల్లో కంటోంది.

వాని మొగం బెఱుంగఁడు ది
వాపతి యాయన యట్లు వచ్చుచో
దా నిటులేగి తప్పికొను
దైత్యులలోఁ బెనుచెల్మి, యొక్క ఘో
రానికి పీడు కాదనగ
రాదు, సమూలముగా వధింపగా
బూనఁడ, యింటిలోపలను
బోరు లతాంగియుఁ దోడునీడయై.

ఆ బిడ్డ లాయన బిడ్డలే. అయితే ఏం? ఎప్పుడూ ఆయనకంట పడరు. ఆయన ఇట్లా వస్తే తా మట్లా పోతారు. పరమ దైత్యులతో స్నేహం చేస్తారు. ఎన్ని ఘోరాలు చేస్తున్నా ఏ ఒక్కదానికీ ఈయన ఏమనడానికీ వీలే లేదు. ఎంత చెడ్డా కన్న బిడ్డలాయె. ఈయనా వాటిని సమూలంగా చంపే ప్రయత్నం చెయ్యలేదు. మమకారాన్ని చంపుకుని ప్రయత్నిద్దామన్నా కనపడనప్పటికీ ఎప్పుడూ తోడునీడయై వెంబడి ఉండే భార్య ఇంట్లో తెగపోరు పెడ్తూ ఉంటుంది వాటినేమీ చెయ్యవద్దంటూ.

( సశేషం )

# విశ్వనాథతో ఇష్టాగోష్ఠి

[1970లో శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు విడవలూరు (నెల్లూరుజిల్లా)లో శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం గారియింట్లో బసచేసి వారితోనూ, వారి సతీమణి వసుంధరా దేవిగారితోనూ జరపినగోష్ఠి టేప్ రికార్డు చేయఁబడిన పాఠము]

## రసము – జీవలక్షణం

వ : శిల్పమూ కవిత్వమూ అనేవాటిని గ్రహించేవాడి దృష్టిలో చెప్తున్నారు. కవిగా రచయితగా వుండేవాళ్ళ అనుభవం విషయంకాదా మీరుచెప్పింది ?

వి : కాదు. ద్రష్ట – చూచేవాడు. శ్రోత–వినేవాడు. రసము సామాజిక నిష్ఠము అన్నాడు. కవిత్వాన్నుంచో నాట్యంనుంచో వచ్చే ఆనందం వుందే, రసం–అది సామాజికనిష్ఠం.నటనిష్ఠంకూడ కొంతఅవుతుంది.కాని ప్రధానంగాసామాజికనిష్ఠము...అక్కడా దుష్యంతుడితో వీడికి సంబంధం లేదు. ఆ శకుంతలతో సంబంధంలేదు వీడికి. ఏంజేశాడు వీడు ? అక్కడ దుష్యంతుడనే ఒకపురుషుడూ, శకుంతల అనే ఒక స్త్రీ. వాళ్ళిద్దరి ప్రేమ భావాలయొక్క పరిణామాన్ని గూర్చి వీడూహిస్తున్నాడు. అదేమిటి? అది తను కాదు. ఆ జీవలక్షణమైన స్త్రీ పురుష భావాన్ని వీడు భావించడం. అంతేతప్ప సంబంధం 'ఏది? తత్ స్త్రీ పురుష సంబంధమైన భావమును వీడు భావించడంలో తనూ తన స్త్రీ అనే భావానికి సంబంధంలేదు. దానికి మూలభూతమైన, జీవగతమైనటువంటి స్త్రీ పురుషసంబంధమైన భావన అది. ఈ మూలగతమైన, స్త్రీ పురుష వాంఛాసంబంధమైనభావన ఎక్కడున్నదీ? జీవుడై జన్మించడంలో వున్నది. జీవ సంపుటిలో వున్నది. ఆ జీవుడు ఈ లౌకిక బద్ధుడుకాడు. లౌకిక భావబద్ధుడు. ఆ భావమనేది యీ వస్తువు కాదు. దాని తత్త్వం. ఆ తత్త్వ స్ఫూర్తితో వున్నాడన్నమాట అప్పుడాజీవుడు. అదీ ఆనంద మంటే! ఆ స్థితి పరాకాష్ఠనుబొందితే అదీ రసమంటే. ఇక్కడ దానిని గురించి భావన చేయగా చేయగా యీ స్త్రీపురుష సంబంధమైన భావనే పోయి వట్టి ఆనందమే మిగుల్తుంది. అదీ రసమంటే.

వ : చదివేవాళ్ళు యిలా మూలమైన విషయాలేకాకుండా దుష్టమైన విషయాలుకూడా చదువుతూ వుంటారుకదా.

వి : చదివితే యింకా ఆ జీవుణ్ణి కలుషితం చేసుకుంటున్నాడు. ఎందుకంటే భావలగ్నమైన దానియొక్క projection కదా యిది. దానియొక్క బహిరావిష్కరణ. ఈ బహిరావిష్కరణలో వున్నటువంటి అనేకమైన దుష్టపుటూహాలచేత ఆసిద్ధాంతం కలుషితమౌతున్నది. ఆ ప్రధాన వస్తువు ఏ ఉత్తమమైన విషయాల సాహచర్యంచేత ఆనందం పొందటానికి ఉంటున్నదో, దుష్టమైన విషయాలు చదివేటప్పటికి ఆ అందానికి వ్యతిరిక్తమైన భావాలు ఆ జీవలక్షణంలో ఏర్పడి మళ్ళీ అది బహిరావిష్కరణకువచ్చేటప్పటికి దుష్టంగా ఆవిష్కృతమౌతున్నది. వాళ్లే ఏపని చెయ్యటానికీ వెనక్కు తియ్యరు.

వ : మొదట వాళ్లు ఎందువలన అటువంటి దుష్టమైన దాన్లో interested గా ఉంటున్నారు? ఆ లక్షణం జీవలక్షణంలో వుందా?

వి : జీవలక్షణంలోవుంది. జీవలక్షణం అంటే వట్టిజీవుడియొక్క లక్షణం. అసలు జీవుడంటే ఏమిటి ? జీవుడంటే మన శాస్త్రాల్లోచెప్పింది 'ఏమిటంటే- యిదిగో ఇప్పుడు నేను విశ్వనాథ సత్యనారాయణని.ఇక్కడ పుట్టాను.యిట్లా పెరిగాను. ఈదుఃఖములు అనుభవించాను వీటియందు ఆశ తగులుకున్నది. ఈ ఆశతో యీ భావములతో యీచిత్రములతో యీసుఖదుఃఖములతో వీటన్నిటి చేతా, యిదంతా ఒక సమాహారమై, ఒక పిండమై, ఒక ముద్రగా వుంటోంది. ఇది వూరికే యిట్లా పరిచినప్పుడు భిన్నంగా కనిపిస్తున్నదే తప్ప, పరవనప్పుడు ఒక చిన్న లేశ భూతంగా వున్నది. ఈసంస్కారములన్నీ అక్కడవున్నై. ఉన్నవనటానికి ఋజువేమిటంటే మనం మాట్లాడినప్పుడు వ్యవహరించినప్పుడు మనస్సక్కడవుంది. వ్యవహార దశలో ఆ మనస్సులో యిమిడి వుండి అంతర్లగ్నములైయున్న విషయములే గదా బయటికొస్తున్నై. ఈ బయటికి రానిస్థితిలో అవి అక్కడ వున్నై కదా. అలా జీవలక్షణం వుంది.

వ : అప్పుడు యీదుష్టమైనది కూడా ఆ జీవలక్షణంలో వున్నదికదా.

వి : ఉండి వుంటుంది. ఇంకో జన్మ ఎత్తుతున్నాడు అంటే యీ జీవుడే వస్తున్నాడక్కడికి. ఆ వెనక లక్షణాలన్నీ వస్తున్నై యిక్కడికి. ఇహఅది continuous అన్నమాట. వరసంబడే వస్తోంది.

వ : ఇప్పుడు మనం వున్నాం గదండీ. మనకి పెద్దలుచెప్పడం. శాస్త్రప్రమాణం తప్పించి మనంవెనక ఒక జన్మఎత్తివున్నామనీ, అది గడిచిందిఅనీ అనేదానికి మనకి ఋజువు ?

వి : ఎట్లా ఋజువంటే కార్యకారణ సంబంధం చేత! ఇది ఇవాళ యిట్లా వుందంటే దాని అంతట అది వుండదుగదా జీవులందరూ కూడాహఠాత్తుగా పుట్టారనాలి. వెనక 'ఏమీ కారణం లేకుండా పుట్టారనాలి. పుట్టిన జీవులయందు భిన్నత్వం కన్పిస్తోంది. ఒక్కొక్కడి లక్షణం ఒక్కొక్క పద్ధతిగా వస్తోంది. ప్రతిజీవికి ఒకానొక వ్యక్తిత్వం ఎక్కడోవుంది. ఈపుట్టక ముందు వాడెక్కడున్నాడో మనకు తెలియకుండా హఠాత్తుగా పుట్టాడా? పుడితే భిన్న జీవులుభిన్నంగాఎందుకు పుట్టాలి? వీడి యందు మంచి ఊహ లెందుకుండాలి? వాడి యందు చెడ్డ ఊహలెందుకుండాలి? వాడికి భాగ్యం ఎందుకు లభించాలి? వాటికి ప్రయత్నం ఎందుకు చెయ్యాలి ?

(సశేషము)

# ఒక చిలుకముక్కులో ఇరవై ఇంద్రధనుస్సులు

— శ్రీ సోమసుందర్.

ఆదిమ ఆలంకారికుల నుంచి – ఆధునిక విమర్శకులవరకూ కవిత్వం సహృదయుల కోసమే అని పదే పదే ఉద్ఘాటిస్తూనే ఉన్నారు. పారంపర్యంగా సహృదయత కింత బహుళవ్యాప్తి లభించడంతో, దీనికి గల శబ్దగతార్థం దాదాపు ఏప్యమవుతోంది. ఈపదానికి గల లోలోపలి విలువనూ, అర్థలక్షణాన్ని పట్టించుకోకుండా సర్వులూ సర్వకాలాలా ప్రయోగిస్తూండడంవల్ల – ఇది కేవలం ఒక ఊతపదంగా మారిపోయింది. ఒకడు తనకిష్టమైనరీతిగా ఒక కావ్యంపై తీర్పు చెప్పడానికి వెసులుబాటు కలిగించే దొంగ మాటగా తయారైంది.

ఇలాంటిఅర్థవిపర్యయం చాలాపదాలకు సంభవించడం సహజమే! కాని ఈ అతి ప్రాణప్రదమైన ఈపదానికిజరగిన అన్యాయం మాత్రం ఉదాసీనంగా విస్మరించ తగిందికాదు.

కవిత్వాది కళలలో అభివ్యక్తమైన సాధారణ అర్థానికిఅతీతంగా అనభివ్యక్త మౌలిక భావాన్ని అందుకో గలగడమే రసజ్ఞత. వాచ్యంగా చెప్పబడిన దాన్నేగాక, పాత్రచిత్రణ ద్వారాగాని, సన్నివేశ వర్ణనద్వారాగాని, సంఘటనావిష్కరణ ద్వారాగాని, వక్రోక్తివంటి అభివ్యంజనా రీతిద్వారా గాని – ధ్వనించబడిన ఒకానొక అతీతమానవాత్మక ధర్మాన్ని పఠిత లేదా శ్రోత సహానుభూతితో లోనారసి పారమ్యత చెరిగి వ్యాఖ్యానాన్ని అందించుకోవడమే సహృదయతగా ఆర్ష నిర్ణయం! కనుకనే అరసికుడు సహృదయుడు కాలేడని వక్కాణించబడింది.

మనప్రాచీనాలంకారికులంతా ఈపరిమితార్థాన్నే నిర్వచించారు. ఈపదానికింతకన్న అతీతార్థాన్నివ్వడంగాని, అర్థప్రతిపత్తి లేకుండా ప్రయోగించడంగాని దురదృష్టమే! అర్థం గురించి పట్టించుకోకుండా అలవాటుగా వాడటం దేని పట్లనైనా వైపరీత్యమే!

ఒక ప్రతిభావంతుడైన కవి పరిమిత పదాలలోనే అపరిమితార్థాన్ని నిక్షేపిస్తాడు. నిశ్చల తటాకజలంపై పడిన పాడిరాయిలా అనంత ఆవృత్తాలను సాహితీతలంపై ప్రేరేపించ గలుగుతాడు. రసజ్ఞుడు వాటిని అందుకో గలగాలి. సహృదయుడైన విమర్శకుడు ఆ ఆవృత్తాలను గ్రహించి,వాటిస్వరూపస్వభావాలను వివరించగలగాలి. అంతేకాని, తన కిచ్చవచ్చిన రీతిగా, కావ్యంపై, తీర్పు చెప్పడం వివేకంకాదు.

ఒక కవి అహోరాత్రాలు ధ్యానమగ్నుడై కవితా తపస్సు సలుపుతాడు. తాజ్ మహల్ వంటి ఒక ఉత్తమశిల్ప బంధుర కావ్యాన్ని నిర్మిస్తాడు. ఎంతో అవస్థపడి దానిని ముద్రించుకొంటాడు. పత్రికలకు సమీక్షార్థం పంపుకుంటాడు. పత్రికాధిపతి ఒకడిని సహృదయవిమర్శకుడుగా భ్రమించి ఆగ్రంథప్రతిని పంపి, సమీక్షించమంటాడు.

ఆరచయిత పైపై మెరుగులతో తళతళలాడుతున్నాడే తప్ప – లోపల మానసికంగా అంగుష్ఠమాత్రుడని పత్రికాధిపతికేం తెలుసు పాపం! తగుదునమ్మాఅని ఆరచయిత ఆ తాజ్ మహల్ చిట్టచివరి బురుజువరకూ ఎగబాకుతాడు. ఆబురుజు పైకెక్కి గొంతెత్తి తీవ్రవిషాదం దట్టించి కేకలువేస్తాడు. "చూడండోహో! నేనీ తాజ్మహల్ కన్న ఉన్నతుడ్ని!" అంటూ! అలాఉంటోంది వర్తమాన సమీక్షావ్యాపారం!

ఏకావ్యానికైనా ఒక తాత్త్వికాంశ ఆంతరిక అస్థిమజ్జాసదృశంగా ఉంటుంది. కావ్యం ఒక వనస్పతి అనుకుంటే – అది ఇంతబలంగా ఉన్నతోన్నత సీమలకు విజృంభించడానికి కారణభూతమైన బీజానికి భూజావాపనం చేసిన భూతలంగా తాత్త్వికవగాహన తనరారుతుంది. అంతే! తత్వశాస్త్రాంశమే దాని అంతర్ బహిస్స్వరూపం కాదు. కాకూడదు. కనుక ఆ కావ్యాన్ని ఒక విమర్శకుడు పరామర్శించేటపుడు కావ్యగత సౌందర్యాలను ఆవిష్కరించడమే ప్రధానధ్యేయంగా స్వీకరించాలితప్ప – తాత్త్విక సిద్ధాంతాలతో ఖండనమండనలకు దిగకూడదు. తాత్త్విక శాఖాచంక్రమణం చేయపూనుకుని, పొయిటిక్ సెన్సిబిలిటీని త్యాగం చేయకూడదు.

కావ్యనిర్మాణంలో ఉపయుక్తమైన ప్రతీకలద్వారా, పదచిత్రాల ద్వారా, అనేక తాత్త్వికాంశాలు క్వణితం కావచ్చును. అలా ఇవొకేటివ్ గా అందిపుచ్చుకొన్న తాత్త్వికాంశాలను ఎవడికితోచిన రీతిగా వాడువ్యాఖ్యానం [ఇంటర్‌ప్రిటీషన్] యిచ్చేవీలూ కలగవచ్చు. కాని ఆ సిద్ధాంత చర్చకే కావ్యాన్ని ఆకరం చేయడం – శిఖరాలను విడిచి మరివేటినో స్పర్శించడమే కాగలదు. కనుక కావ్యాన్ని తాత్త్విక సిద్ధాంత పరిధిలోని కీడ్చి – ఖండన మండనలకు పూనుకోవడం రసజ్ఞతాకాదు. సహృదయతా కాదు! అలాంటి వైమర్శిక పాషండత్వానికి Refined sencibility అనేది దగ్గరకైనారాదు!

కవితా సంబంధి పదచిత్రాలకు, ప్రతీకలకూ సమాంతర తాత్త్విక సిద్ధాంతాలను(Philosophic Analogies) అన్వేషించి, సూత్రబద్ధం చేయబూనడం అవసరమూ కాదు. వివేకమూ కాదు.

ఇలాంటి వివేకభ్రష్టసంపాతాలు ఇటీవల రెండు చేతులూ తిరిగినవారినుంచే వినిపిస్తూండటం - చోద్యమేగాక, శోచ్యము కూడా!

వర్తమాన సాహితీరంగంలో దాదాపు వేయిమంది కవులున్నారు. ఐతే యింత పెద్ద 'మంది'లోనూ మనుషులుగా పేర్కొనవలసినవారు పదుల సంఖ్యను మించరు. అందునా కొందరు గతకాలపు కీర్తి నిలవలమీద బ్రతుకుతున్నవారే తప్ప, సమకాలీన ప్రవాహంతో కలిసి సాగుతున్నవారుకాదు. మనకి మరీవిడ్డూరమైన కవులు కొందరున్నారు. ఒక్క అంత్యప్రాస కోసం దారాపుత్రాదుల్ని త్యజించగల మహనీయులువారు!

ఏకాలంలోనైనా కవితా రంగంలో విశిష్టకంఠ ధ్వని గల కవులు కొద్దిమందే వుంటారు. మిగిలిన అసంఖ్యాక కవిమాత్రులూ ప్రతిధ్వని తరంగాలే! సాధకుడూ ప్రారంభకుడూ అగు కవిహృదయంలో - సిద్ధుడైన ప్రతిభావంతుడు కలిగించే ప్రతిధ్వనులు అసంఖ్యాక ఆవృత్తాలు కలిగిస్తూ ఉంటాయి. అట్టి ఆవృత్తాల ప్రభావానికి అవిమర్శకంగా వివశులై స్వీకరించిన వాటినే పునరభివ్యక్తం చేస్తే - అట్టి వాడు అనుకరణశీలిగా మిగిలిపోతాడు. వాడి కృషి మౌలికతను కోల్పోతుంది. "All good things which exist are the fruits of originality" అనే కితాబుకర్హం కాలేక నవ్వులపాలు కాక తప్పదు. ఒక ప్రతిభావంతుడుకలిగించే ప్రతిధ్వనులు - వేరొక కవి ప్రతిభావరణంలో లీలగా వినిపించే పద ధ్వనులు కావాలే తప్ప- వాడి హృదయాన్ని ఆవరించుకొని వదలని పీడ నీడలుగా మూర్తీభవించకూడదు. అలాంటి అల్పప్రతిభులు జీవన మహోద్ధృత సృజనశక్తిని (life's generative force) ఆకళించుకోలేని వారే అవుతారు. సృజనాత్మక ప్రతిచర్య ద్వారా, సంయమిత కళాసంధానం ద్వారా, సిద్ధుడై ఒక కవి తానాశించే గమ్యాన్ని చేరుకోవడం- తనకనుల ఎదుట నున్న ప్రజాజీవితంలో విజృంభించే ఉద్యమోత్సాహాన్ని ప్రతిరతించాలేతప్ప సమకాలీన కవిత్వాన్ని కాదు. కేవలం ప్రతిధ్వనులు మాత్రమే ప్రోగుచేసుకొనే కవిని సాహిత్య చరిత్ర స్పర్శించదు. విస్మృత సీమలకు నెట్టి ముందుకుసాగిపోతుంది.

ఒక మహత్త్వ పూర్ణుడైన కవికి అనుయాయులు (adherents) అసంఖ్యాకంగా ఏర్పడటం సహజమే. ఒక ప్రతిభావంతుని అనుయాయిగా రూపొందడమే ప్రారంభకునికి గర్వకారణం కావడమూ సహజమే. కాని ఆగర్వం ప్రతిభావంతుని చరిత్రకే దోహదం చేస్తుంది. ఆరంభకుడు నిరంతర సాధనతో పురోగమించాలి. అనుకరణపిండిబొమ్మలను విధ్వంసం చేసుకుంటూ సాగితే తప్ప సిద్ధుడు కాలేడు. మిల్టన్ మహాకవి చెప్పినట్లుగా - ఉత్తమ గ్రంథం మహామేధావి రక్తంతో రచించ బడుతుందన్న సూక్తి సిద్ధుని పట్లనే ధ్రువపడుతుంది. కవితాసిద్ధికి ఇంతకన్న మరే దగ్గరదారీ దొరకదు!

చిత్తశుద్ధితోసాధన చేయడంగాక, కవిగానో రచయితగానో కీర్తి పొందడానికి అడ్డదారులు వెతుక్కోవడంలోనే అధిక సంఖ్యాకులు నిమగ్నమవుతున్నారు. వర్తమాన సాహిత్యస్థితి పరిశీలిస్తుంటే నాకిలాంటి అపభ్రంశ చిత్రమే దర్శన మిస్తోంది.

నేటి తెలుగు సాహిత్యం ఒకరైలు బండిలా సాగిపోతోంది. వేలాది కవులూ రచయితలూ క్రిక్కిరిసి ప్రయాణం చేస్తున్నారు. కవులరైలు వస్తోంది కదా స్వాగతిద్దా మనీ వాళ్లని సందర్శించుకుందామనీ లక్షలాది ప్రజలు - ప్రతి ప్లాట్ ఫారంపైనీ గుంపులు గుంపులుగా గుమికూడారు. ఇంతమంది ప్రజలు తమకోసమే నిరీక్షిస్తూ కనిపించేసరికి - కవులూ రచయితలూ ఉండ బట్టలేకపోతున్నారు! కిటికీలలోంచి తలలు పైకి పెట్టి - చిరునవ్వులు విసురుతున్నారు.

రైలూ ప్లాట్ ఫారాలూకూడా కిటకిటలాడుతున్నాయి.

కవులూ రచయితలూ ప్రజలతో చెప్పుకోవలసిన తమ హృదయా వేదనలను గొంతెత్తి వెల్లడిస్తున్నారు. రైలు రణగొణధ్వని చేస్తూ సాగుతూనే ఉంది. ఒకరి మాట ఒకరికి వినిపించడంలేదు. రచయితల్ని చూసి ప్రజలూ హర్షధ్వానాలు సలుపుతున్నారు. ఏవో చెప్పుకుంటున్నారు. అంతా కలవరంగాఉంది. కల్లోలం వ్యాపిస్తోంది!

ప్లాట్ ఫారాలపై గుమికూడిన ప్రజలు అర్ధ్రనయనాలతో చేతులూపుతున్నారు. చిరునవ్వులు చిందిస్తున్నారు!

ఈ రైలు ఇలా ఆగకుండా ఎక్కడికి పోతుందో - రచయితలకీ తెలియదు; ప్రజలకూ తెలియదు. కాని అందరి మనసుల్లోనూ ఏదో ఆశ వెలుగుతోంది!

ఆ ఆశ అడియాసకాదని మహావేగంతో సాగిపోతున్న ఈ రైలు రుజువు చేస్తే ఎంత బాగుండును ?!

( సశేషం )

# సత్యము - ధర్మము

— ఎం. కృష్ణస్వామి, ఎం. ఏ.

సత్యమునే పలుకుము. ధర్మమునే చరించుము. ఈ రెండింటి ఆచరణలో పరాకు పడకుము. అని వేదము ఉపదేశించుచు చున్నది. మనువు మొదలగు మహర్షులు తాము రచించిన ధర్మశాస్త్ర గ్రంథములందు సత్యధర్మముల ఆచరణ విధానమును మానవుల కొఱకు నిర్దేశించి చూపినారు. ఆదికవి వాల్మీకి, పమరగురువు వేదవ్యాసుడు తమకావ్య ఇతిహాసములందు సత్యధర్మముల ఆచరణము సామాన్యమానవునకుఁ గూడ అర్థమగునట్లుగ, అందుబాటులో నుండునట్లుగ మలచి యిచ్చినారు. మానవుల నుద్ధరించుటకుదిగి వచ్చిన ప్రవక్త లందరు సత్యధర్మ సమన్వయ స్వరూపమే తమ జీవితముగా ప్రసాదించి వెళ్ళి యున్నారు.

సామాన్యముగా ప్రతిమానవుడు తనకు సాధ్యమైనంత వరకు సత్యధర్మముల నాచరించుటకే ప్రయత్నించుచుండును. లేదా కనీసము సత్యధర్మముల కనుగుణముగ తనజీవితముసాగవలెనని కోరుకొనుచుండును. కోరుకొనుటవరకు కూడ పెరుగని మానవుడు వానినిచూచి భయపడుచుండును. అసత్యము పలుకువారు, అధర్మము నాచరించు వారు నలుగురిల్లోతలెత్తుకొనలేక పోవుట మనము చూచుచునే యున్నాము. అన్ని స్థితులలో నున్న మానవులచే ఏదో ఒక విధముగా స్మరింపబడుచున్న సత్యధర్మముల స్వరూపస్వభావము లేమిటో కొంచెము వివరముగా పరిశీలింతము.

ఈశావాస్యోప నిషత్తులో ఒక మంత్రమున్నది.

'హిరణ్మయేన పాత్రేణ
సత్యస్యాపిహితం ముఖం
తత్ త్వం పూషన్ అపావృణు
సత్య ధర్మాయ దృష్టయే'

'హిరణ్మయమైన పాత్రచే నీ ముఖము కప్పబడియున్నది. సత్య ధర్మములను మేము దర్శించుట కొరకు నీవు దానిని తొలగించుము' అని ప్రార్థించుచున్నాడు ఉపనిషదృషి. సూర్యుని గూర్చి చేయుచున్న ప్రార్థన యిది. లోకములను ప్రసవించి పోషించు దైవస్వరూపుడగు అతడు మానవుని కన్నులకు మాత్రము బంగారు పళ్ళెమువలె కనబడు చున్నాడు గదా! ఆపాత్ర కావల ఆతని నిజస్వరూపమున్నది. ఆ నిజస్వరూపమునే - ఆదిత్యహృదయముగా రామునికి ఉపదేశించినాడు అగస్త్య మహర్షి.

సత్యము, ధర్మము - వీని మధ్యగల బాంధవ్య మేమి? దేనినుండి ఈసృష్టి దిగివచ్చుచున్నదో! దేనియందు ఈ సృష్టి వర్తించుచున్నదో! మరల దేనిలోనికి ఈ సృష్టి లీనమగుచున్నదో! ఆ శాశ్వతమగు చైతన్యస్వరూపము సత్యము అని పిలువబడినది. ఆ సత్యమునుండి సృష్టి ప్రభవించుట, వర్తించుట, తిరిగి లీనమగుట ధర్మముయొక్క స్వరూపముగా దర్శింపబడినది.

మరి ఆ సత్య ధర్మములకు మన మనుకొను సత్యధర్మములకు సంబంధమేమి? అనునది ప్రశ్న. దానికి సమాధాన మిది. వేదఋషులు సత్యధర్మములను దర్శించి కీర్తించిరి. మానవజీవిత గమ్యము ఆ సత్యధర్మములతో శ్రుతి కలిపి శాశ్వతత్వము ననుభవించుటేయని నొక్కి చెప్పిరి. అయిన మానవుడు ఆ సత్యధర్మములతో శ్రుతి కలుపగలుగు టెట్లు? ఆ విధానమును తెలుపుటకే మనువు మొదలగు మహర్షులు స్మృతులను రచించి యిచ్చిరి. మానవునిచే నిర్వహింపబడు చతుర్విధ పురుషార్థములు (ధర్మార్థకామ మోక్షములు) వర్ణాశ్రమధర్మములు జీవితమునందలి వివిధ సన్నివేశముల నిర్వహణము నే రీతిగనుండిన శాశ్వతధర్మముతో శ్రుతికలియునో ఆ రీతిగ మలచి మనకొరకు నిర్వచించిరి. శాశ్వతమగు ఆ ధర్మమును అనుసరించుటకు గాను ఏర్పడినవి గాన ఇవియును ధర్మములని పిలువబడినవి. స్మృతులలో విధింపబడిన ధర్మములు రామాయణ భారతాది ఇతిహాసములలో పదునెనిమిది పురాణములలో సమన్వయింపబడి ఉదాహరణ పూర్వకముగ మనకు అక్కరకువచ్చులాగున చెప్పబడినవి. వాని ప్రకారము నడచుట అలవాటు చేసికొనిన కొలది శాశ్వత మగు ధర్మదర్శనము మనకు లభించును.

ధర్మము ననుసరించుచు సత్యవాక్కు కలిగిన వానికి శాశ్వతమగు సత్యము దర్శనమిచ్చును. అనగా ధర్మమగు ప్రవర్తన కలిగి తనకు తెలిసిన విషయములను దాచకుండ చెప్పు వానికి సత్యము అనుభవమునకు వచ్చును. దాచుటకు అలవాటు పడిన వానికి ఆ సత్యముకూడ దాగును. అయినచో సత్యము నెట్లు పలుకవలెను. ఇట్లు పలుకవలె నని మనువు చెప్పుచున్నాడు.

'సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాన్
న బ్రూయాత్ సత్య మప్రియమ్
ప్రియం చ నాఽనృతం బ్రూయాత్
ఏష ధర్మ స్సనాతనః'

'సత్యమునే పలుకుము. ప్రియమునే మాటలాడుము. సత్యమైనను అప్రియమును పలుకకుము. ప్రియముగదా యని అనృతమాడకుము. ఇదే సనాతనధర్మము' మనువుచేసిన ఈ హితోపదేశమును స్వీకరించి మన వాక్కు ముందునకు సాగవలెను. సత్య వాక్కు ముందునకు సాగవలెను. సత్యమును హితముగా, ప్రియముగా మాట

( తరువాయి 13 వ పేజీలో )

# ప్రకృతి చిత్రముల "స్వప్నకథ"

రచన : డాక్టర్ జి. బి. ఎన్. ఆచార్య; ఎం. ఏ పిహెచ్. డి.

ప్రకృతి కవిని ఆలోచింపచేయును. ఆ ఆలోచన కొనదేరి తాత్త్విక నిర్వచనములను పూయించును. కవికోకిల జాషువ గారి 'స్వప్నకథ' ఒక కవితా స్వప్నము చంద్ర లోకములో 'అవ్వ' కవిగారికి చెప్పిన కథ – జనసామాన్యమునకు, వారి వేదనలకు సంబంధించిన దగుట విశేషము. ఇందలి ద్వితీయాశ్వాసము ఒక 'అనాథ' కు సంబంధించిన కరుణరసపూరిత–కన్నీటి గాథ. ఇందలి దురాచార విమర్శనము జాషువ గారి సంఘ సంస్కార ప్రియత్వమునకు నిదర్శనము. ఈ కావ్యము నందు మొదటిది సమగ్రము. రెండవది అసమగ్రము; ఒకటి మూటగట్ట బడిన గాలి. రెండవది సలసల క్రాగి చిందిన కన్నీటి బిందువు. ఈ రెండింటి యందును గల జాషువగారి అక్షర రూప ప్రకృతి చిత్రములను నవ్య కవితా ప్రియుల కనులకు కట్టించుటయే నా సంకల్పము.

'స్వప్నకథ' యందు వ్యోమ పథములో చుక్కలను, గ్రహములను, చంద్ర బింబమును ఆయన వర్ణించిన తీరు ప్రతిభావంతముగా కనిపించును.

"ముంజేతవడు వెన్నపూస ముద్దల వంటి
మింటి చుక్కలతోడ మేలమాడి
మొగలి పుప్పొడివర్షమును బోలు తెలుపైన
పొగమంచు తెరల దోబూచులాడి
కటిక సంధ్యాగ్నిలో కరగిపోవని క్రొత్త
స్వాతి మబ్బు గుఱాల స్వారి చేసి
చదలేటి నీట మజ్జన మాడు తెరగంటి
రాచ కన్నెల మీఁద రాలు రువ్వి
మంచువాలు చందమామ మండలమున
నిల్లు మఱచి తిరుగు పిల్లవానిఁ
గ్రమ్మరింప మాడ్కి కాళుల ముసలమ్మ
తిరుగు చుండునోరి! దిన దినంబు"

పై పద్యము నందలి "వెన్నపూస ముద్దల వంటి చుక్కలు; మొగలి పుప్పొడి వంటి పొగమంచు మున్నగునవి కవిగారి భావనా బలమును చాటుటయే గాక; ఉపమాన, ఉపమేయములను రెండింటిని ప్రకృతి నుండియే గ్రహించి ముచ్చటగా ముడిపెట్టగల నేర్పును వెల్లడించుచున్నవి. కవిగారు గాంచిన బాలుని వర్ణించిన తీరు నందు కూడ ప్రకృతి తత్త్వమే నిండియున్నది.

"ఇంద్రధనువు వంటిహృదయంగమంబైన
వన్నె చిన్నె లీను వలువ గట్టి
బాలుఁడొక్కరుండు కేళి సల్పుచు నుండె
కాఱు మబ్బు డోలికలఁ బరుండి"

అను పద్యము నందలి మనోహరత్వము ఎల్లరను ముగ్ధులను జేయుటయే గాక, హృదయఫలకములపై శాశ్వతంగా చిత్రితమై యుండగలదని నా అభిప్రాయము. 'అవ్వ' తన వృత్తాంతమును చెప్పెను —

"ఉదయ సూర్యుని కిరణంబు లొక్కటొకటి, నావటీరంబు కప్పు కన్నుల నుండి, పసిడితీగలవలెఁ జొచ్చి వ్రాలుచుండె, సలలితము లైన తల్లి చూపుల వితాన"

అని వర్ణించినది. ప్రకృతిని ఒజ్జగ, తల్లిగ, దేవతామతల్లిగ నవీనకవులు భావింతురు. కనుకనే జాషువగారు ఉదయ సూర్యుని కిరణములలో మాతృత్వము నాపాదించినారు. ఉదయ సూర్యుని కిరణములను పసిడి తీవెలతో నుపమించుట సహజ సుందరముగా నున్నది.

"ప్రకృతి జనయిత్రి యనుఁగు గారాల సుతుల
నొకని ద్వేషించు నొకని నభ్యుద్ధరించు"

ఇందలి 'ప్రకృతి జనయిత్రి' అనుప్రయోగము పై భావమునే స్ఫురింప జేయుచున్నది.

'అనాథ' యందలి—

'ఉప్పరము నీలి యద్దపుఁ
జిప్ప వలెంగనటు వోయి, చెన్ను వహించెన్
గప్పుర కప్పుర చీకఁటి
తెప్పలపై నింకనావరించుచునుండెన్'

"విచ్చిన మల్లెపూవుల వలె వేవయ్యె,
ద్విరేఫ ఝుంకృతిన్
మచ్చరకించు రాట్నపు నినాదములొప్పె"

అను ప్రకృతి వర్ణనలు కవిగారి ప్రతిభను చాటుచున్నవి. ఆకాశమును నీలియద్దపు చిప్పతోడను, వేకువను విచ్చినమల్లెపూవుతోడను, రాట్నపు నినాదమును ద్విరేఫ ఝుంకృతి తోడను పోల్చిచెప్పుట యందలి ఔచిత్యము సహృదయ విమర్శకులకు సువిదితమే

"ఉఱుములు మెఱుములు గల యొక
శరదము గగనమునమసలి క్షణకాలమునన్
గురిసెం బ్రచండ వర్షము
నిరులు గవియ మన్ను మిన్ను నేకము గు
గతిన్"

అనివర్ష పాతమును ఒక చిన్న పద్యములో కడు సమర్థతతో వర్ణించినారు. 'మన్ను మిన్ను నేకము గు గతిన్' అను చక్కని నుడికారమును ప్రయోగించి, వర్షాధిక్యమును స్ఫురింపజేసినారు. వాన వెలిసిపోవుటను ఈక్రింది విధముగా వర్ణించినారు.

"మగడు గొట్టిన రోదించి మానుకొన్న
పెద్ద గయ్యాళి వలె వాన వెలిసి పోయె
మమత లుడిగిన సన్యాసి మనసు వోలె
గగన మండలంబెల్ల నిష్కలుషమయ్యె."

ఇందలి యుపమలలో నవీన దృక్పథము గోచరించుచున్నది. ప్రకృతి ముఖమున జీవన సత్యములను వ్యక్తము చేయ గల నేర్పు జాషువగారికి గలదనుట కిది చక్కని యుదాహరణము. స్వచ్ఛమైన గగన మండలమును మమత లుడిగిన సన్యాసి మనసుతో నుపమించుట జాషువగారి ఔచితీ పరిజ్ఞానమునకు గీటురాయి. వాన వెలిసిన క్షణానంతరము ప్రకృ

తిలో గలిగిన మార్పులను వర్ణించుచు —

"ఆకటం దూలు సస్యశ్యామల క్షేత్ర
కన్య గర్భము చల్ల గాభుజించె
బక్కచిక్కిన కొండ వాగుం దటాకంబు
జిటుకలో నుప్పొంగి చియ్యబట్టె
ముమ్మాయి ముత్యంబువోలి తామరమీఁద
వర్ష బిందువు తాండవంబు సేసె
నడయాడు రతనంబు వడువున నాడ్డాడ
ఆస్రద పురువు ప్రత్యక్షమయ్యె
చెలగి చేయూర దానంబు జేసి చేసి
కొఱతవడియున్న వాని కాపురమువోలి
యుబ్బసెడి తూలె సొకచిన్న
మబ్బుతునుక
యుత్తరంబుగ దిక్కుల కొత్తిగిల్లి"

అని రమణీయముగా వర్ణించినారు. ఇందలి "బక్కచిక్కిన అనునది చక్కని జాతీయము. ఈజాతీయమును సర్వసాధారణముగా పశువులకే ప్రయోగింతురు. మానవుల విషయము నందుకూడ అంగీకార్యమే. కాని, కవిగారు నవ్యధోరణిలో 'బక్కచిక్కిన కొండవాగు' అని ప్రయోగించినారు. ఇది కొంత విచిత్రముగా నున్నను కవిగారి నవ్యతాప్రీతిని ప్రశంసింప వలసి యున్నది. వర్షించిన మబ్బు 'ఉబ్బ' తగ్గియుండును. ఉన్నదంతయు దానధర్మములుచేసి, చివరకు రిక్తహస్తములతోనున్న సంసారి పరిస్థితికూడ అట్టిదే. సహజముగా ప్రకృతి నుండి ఉపమానములను గ్రహించు పద్ధతి యుండగా; జాషువగారు మానవ లక్షణములనే ఉమానముగా తీసికొని, ప్రకృతిని ఉపమేయముగా చేయుట, నవ్యతను వెల్లడించుచున్నది.

ఈ కావ్యమునందలి ప్రకృతి చిత్రములను దర్శించిన పిమ్మట, జాషువగారి ప్రకృతి ప్రీతి, తద్రచన యందలి నేర్పు పూవు - తావి వంటివని మనకు విదితమగును. విశిష్టమైన నవ్య లక్షణములను 'గుదిగ్రుచ్చి' అల్లిన జాషువగారి 'స్వప్న కథ' ఆధుని కాంధ్ర సాహితీ లోకమున చిరస్మరణీయము. గగ




# శివాశివలీల

[ శ్రీ శిష్టా బాలకోటీశ్వరరావుగారు. శ్రీ నీలా నిలయం. కాట్రావులపల్లి. పెద్దాపురం తాలూకా. తూ. గో. జిల్లా. వెల మూడు రూపాయలు]

వ్యాకరణాలంకారాది శాస్త్ర నిబంధ సోపాన సాహిత్య విలసితమైన వాఙ్మయ నదీప్రవాహము మధురజీవనము. ఆ జీవనదీపరిణాహ సౌందర్యమునకు ముగ్ధులై యందవగాహము చేయువారు కవి సహృదయ భేదముచే ద్వైవిధ్యము నందుదురు. కవులు దాని దర్శనాదులచే ఉన్మస్కులై యందు కొంతయైనను స్వీయము గావించుకొన నెంతురు. ఆమధుర జీవన గ్రహణాధారమగు పాత్రతా గుణ జాతము వారికి కార్తార్థ్యమునో వైయర్థ్యమునో కలిగించును. వారిప్రయత్నము విలక్షణాన్వితమైనచో సహృదయా వర్జక మగును. కానిచో ననుకరణమాత్రమై వివర్ణప్రాయ మగును. ప్రాచీనకవుల మార్గములను బరిశీలించి వాఙ్మయ వికాసము నాకళించుకొన్న వారికి వారిస్వభావాను రూపముగా నభిరుచి యేర్పడును. హిమాలయమువలె విస్మయాదికమును గలిగించు కాళిదాసను కరణ దుర్ధరుడు. శ్రీనాథుని గంభీరపద విన్యాసము, కథానిర్వహణాదికము సార్వభౌమతా సమ్మితములు. ఇట్టి యీ రెంటి యనుశీలనచే కవితాకృతినందయత్నించిన వారిలో శ్రీబాలకోటీశ్వరరావుగా రొకరు. వీరి కవితలో శ్రీనాథీయ మెక్కువగా నున్నట్లును భాసించును. లౌల్యమును కలిగించుటలో కాళిదాస శ్రీనాథులు గుండెలుదీసినబంట్లు. అంతియేకాదు. వారి మార్గము కనిపించినంతగా ననుకరణ సాధ్యముకాదు. మొత్తముమీద శ్రీబాలకోటీశ్వరరావుగారి యత్నము చెప్పుకొనదగినదే వీరు శ్రీనాథునివలె విలక్షణప్రయోగశీలత నాశించి కాబోలు 'అంగవించి (51 పే) పంచారింపన్ (17) వాచించిరి (19) అధీకారమ్ము (20) పురాయించి (22)వీలోకించి (24)కరాళించు, కాంతాళించున్ (26) తాగడించె, కరకరించి పిసాళించి, (33) అనూథవించి (36) నితరాంమనోజ్ఞ (40) వంటి వానిని ప్రయోగించిన ట్లగపడును.

ఇది సుమారు రెండువందలయేబది పద్యములతో నున్నది. ఇందు హిమ వద్వర్ణన, పార్వతీ జననము (ప్రాసంగిక వస్తువుగా) సతీ వృత్తాంతము, పార్వతికి శివునిపైగల యనురాగము, మన్మథదాహము, పార్వతి తపస్సు, బ్రహ్మచారి వృత్తాంతము, శివానుగ్రహము నను నవి వర్ణితములు. ఇందు గద్యములు లేకపోవుటచే నిర్వచన మని చెప్పవచ్చును.

వీరు తమకు కాళిదాస శ్రీనాథు లిష్టులని స్తుతించిరి. మిగిలిన కవులను కొందరి [వాల్మీకి, కవిత్రయము,మున్నగు ప్రసిద్ధు]లైన పేర్కొన్నచో బాగుండెడిది. సీసపద్యములు శ్రీనాథుని యొరవడిలో వ్రాయింపబడినవి. కవికి శబ్దానుప్రాసపై నున్న మక్కువ చేమకూరను స్మృతికి దేవచ్చును. ఇంపు నింపు పరిగ్రహింపు మంచు రహింపు మాలింపు" కవి యర్థముకన్న శబ్దాను రూప్యమును ప్రధానము చేసి కొన్నట్లగపడును. "అస్మదనుకంప నాశించి యంగవించి' "ఆగమించి గమనించి"ఉపమానుపమా అసమానలాలసన్

వగైరాలు భట్టుమూర్తిని, మా కన్యార్థంబుల వగైరాలలోను నిలబరచుకొన్నట్లనిపించును. బాహిరించు (8)దుర్భేద్యము (39) వంటివి విచారణీయములుగా నగపడును.

మైనాకుని వృత్తమును వివరించుట, వాని దౌష్ట్యమును, భంగపాట్లును వివరించుట, కథోచితముగా నగపడవు. దాని వలన హిమంతునికిగానికి గాని, మేనకు గాని, పార్వతికి గాని వచ్చిన కథా విషయికలాభ మగపడదుసరిగదా కొంతభంజకముగా గనపడును. కాళిదాసు చమత్కారముగ "అసూత సా నాగ వధూపభోగ్యం మైనాక మంభోనిధి బద్ధసఖ్యం ఇత్యాదిగా కథానుకూల్యము నాకల్పించినాడు. దానిని విరించుట యుక్తముగా నగపడదు. పార్వతీజననమునందు 'అపగతపుత్రాలోకన, విపదావృతయైన మేన వెలితితొలంగన్, తపియించి చంద్రశేఖర కృప నంతర్వత్ని యయ్యె ఖేదము సడలెన్" ఇందుక్రీగీతగీచిన భాగములు విచారణీయములు. మొదటిదానిఅర్థము సులభముగా నగపడదు. రెండవది చంద్రశేఖరుని కృపవలన మేనగర్భవతి కావడం ఉచితముగా నగపడదు. కాళిదాసు సతీదేవి తాం జన్మనే శైలవధూం ప్రపేదే" అన్నాడు. అలాగే నారదుడు సతీవృత్తాంతమును హిమంతునికిఁ జెప్పుట సముచితముగా నగపడదు. శివునితో బంధుత్వాన్ని, కోరేహిమవంతునికి సతీవృత్తాంతము తెలియదా? పార్వతి సతీదేవి యని తెలియకపోవచ్చును. కాళిదాసు 'తాం నారదః కామచరః కదాచిత్ కన్యాం కిలప్రేక్ష్యపితుస్సమీపే ఇత్యాది శ్లోకమున మనోహరముగ సంగ్రహించినాడు. దీనిని వివరించి సాధించిన దేమి? నీకనయము ప్రీతి నిచ్చుసుత యందము చందము సెంచవచ్చితిన్' పార్వతి యందము సెంచ నారదు డెవరు? ఇదేమి యౌచిత్యము! దక్షు డెంత శివనిందకుడైనను శివునకు నింద్యుడుగా వాని చేతద్ధనతల్ వసివాడి యేచ్చునే'యని, అలిగిన నీదుతండ్రి యిత్యాదికమును పలికించుట శివుని పాత్రకు సముచితగా నగపడదు. అల్లే సతీదేవి తండ్రిని పగ్గెలు వల్కెదె భ్రష్ట రూపివై' అనడం దక్షుడు మా కెదురు వాగదవే అని పలకడం పాత్రోచిత రచన కాదు. అల్లే తపసియై వచ్చిన శివుని హిమవంతు దర్శించి మా కన్యార్థంబులు వేడ సేల అనిపలకడం కవికి గల శ్లేషాసక్తిని వెలువరించినను హిమవంతుని పాత్రకు తగదు. శివునికి సేవ చేయుమని పార్వతికి చెప్పినట్లుగా కాళిదాసు 'ఆరాధనాయాస్య సతీసమేతాం సమాదిదేశ ప్రయతాం తనూజాం అని చిత్రించినాడు.

కాళిదాసుని చిత్రణమున మన్మథుడు కర్యాంహరస్యాపి పినాకపాణేః ధైర్యచ్యుతిం కే మమ ధన్వినోన్యే యని గంభీరముగ బలుకగా నిందింద్రుని మాటలు విని మరు డాకంపించె శంకించుచున్" అట. పొదల మాటున శివునకు దగ్గరగా దాగిన మన్మథుడు గౌరిరాక స్థాణువు వోలెన్ తలపోయుచు నిలుచుండె నట- ఇదేమి పద్ధతి? ఇది రసపోషకమా? భంజకమా? కాళిదాసుని మన్మథుడు సమ్మోహనసంధానమే కావించి భస్మావశిష్టుడుకాగా వీరు అస్త్రిప్రయోగమును జెప్పిరి. ఇందువలన శివుని పాత్రౌన్నత్యము దెబ్బ తినలేదా? తపమునకైపోవలదను జననిన్ హసించి శివకామినినై మననేరనే యనెనట. పార్వతి శివకామిని కాఁగోరినదా? పవిత్రమగు పార్వతీప్రేమ కామపరమా? పార్వతీ వివాహానంతర మిట్టి ప్రయోగము సమర్థనీయమేమో కాని యిప్పుడు మాత్రము కాజాలదు. పార్వతి తల్లితో మనవలె నిట్లు పలికినదా? పార్వతి తపమును వర్ణించుచు తెరలె నుమయై యపర్ణయై గిరిశు గెలువ గీతలభాగము లుచితములేనా? కపటబ్రహ్మచారితో పార్వతిసఖి పంతగించె నేమి కానున్నదో యెవ్వరెఱుంగదగు నని ప్రౌఢముగాఁ బలుకుట యేమి? శివదూషణ చేయు బ్రహ్మచారిని "రోషశిఖ చెందొవలై తలరారు కన్నులన్, మించి జుగుప్స పెంచి వాచించె" నట. కాళిదాసుని తపస్విని యైన పార్వతి యెట్లు మారినది? శివ సాక్షాత్కారమున 'గిరిజ శివయయ్యె వధువయ్యె వరదయయ్యె' వర్ణముల కించిత ప్రాధాన్యం ఎందుకు? అర్థసమాలోచన వలదా? ఇట్టి వింకను గలవు.

మొత్తంమీద ఈ కావ్యం కాళిదాసు నెరుగని వారికి, మఱవగలిగిన వారికి మహోజ్జ్వలంగా వుంటుంది. వస్తువు ప్రసిద్ధ దేవతాకమైనప్పుడు కవికి పాత్ర చిత్రణాదికమున జాగరూకత యనుశీలన మరింత యవసరమనిపించును. శ్రీనాథు నంతటి వానికి ప్రియుమైన కాళిదాసు నేటి కింత చవుకయైనాడు. ఈ పుస్తకములో మరొక విశేషము గలదు. దీనిపై నభిప్రాయమిచ్చిన ప్రముఖులు ముగ్గురి యభిప్రాయములు గంభీరములై యున్నవి రచయిత వారికి "ఏవో నాలుగుమాటలు" లో కృతజ్ఞత చెప్పిన పద్ధతి విచిత్రముగా నున్నను సముచితగా నగడపదు. గ్రంథాదిలో పూర్వుల వైదుష్యములో సగం బయిన నాలో నిండి నర్తింప అనే కవి ఆశంస విచిత్రము. అభిప్రాయాలిచ్చినవారిపై అభిప్రాయ ప్రాయాలీయడం తమాషాగానే యున్నది. ప్రతిపదంలోనూ కవికిగల భాషాసంపత్తి ముఖరితమవుతూ వుంటుంది. ఈ గ్రంథమున కభిప్రాయముల నిచ్చిన ప్రముఖులు ముగ్గురూ (శ్రీ మధునాపంతులవారు, శ్రీ వెంపరాలవారు, శ్రీ మల్లంపల్లి శర్మగారు). అభిప్రాయ ప్రదానంలో వీరిని మార్గదర్శిగా భావింపవలసినంత యుత్పథ విన్యాసములో వీరి "యేవో నాలుగు మాట" లున్నవి. ఇవి విచారించ దగిన మాటలు "నెరుప వాతిస్థలం లేకున్నా వ్రాశాను. కాళిదాస శ్రీనాథుల్ని కాదనలేదు. స్మరించి వ్రాశాను. అనా

చిత్యం అసహ్యమని తెలియని కవిరాజ శిఖామణిని గద్య కవి సార్వభౌముణ్ణి స్పృశించి స్నానంచేసి వ్రాశాను."

గీతలంగీసిన పదాలు మిగిలిన పదార్థాల కంటె విచిత్ర తరములై వున్నాయి. "రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురవిడెము... నన్ను బలహీనుణ్ణి చేయలేదు. అటువంటి సుఖాలపై మోజు ఏరోజూనా నాకులేదు." ఇవి పెద్దన గారి బలహీనతల్ని వివరిస్తున్నాయా ? కవి గారి గొప్పదనాన్ని వివరిస్తున్నాయా ?

"ఇది శివలీలా కాదు. శివాలీలా కాదు శివాశివలీల" అని కవిగారు నిష్కర్షగా చెప్పారు. శివాశివశ్రవణంలో అశివ పదస్ఫూర్తిభిన్నముగా నెంతసమర్థించినా యెక్కడికి పోతుంది ? ఇందు ప్రధానము శివుడు పార్వతికి వరుడగుటయా ? పార్వతి తప మాచరించుటా ? సతీ వృత్తాంతము ప్రాసంగికముకదా! అట్టిచో దీనికి శివలీలా ప్రాధాన్యముచే ( కపట బ్రహ్మచారి ప్రదేశాదికముచే ) శివలీల యను నామ ముచితము. సతీవృత్తాంతము పార్వతీ తపస్సు ప్రధానములన్నచో శివాలీల యనుట పొసగును. కాని శివాశివలీల యెట్లు పొసగును? శివాశివులు తరుణీ తరుణులవంటివారు, సోదరీ సోదరుల వంటివారు, కాగలరా ? అయినను సమాహితులము కావలె నను మాటలో వక్తృవివక్ష వేరు, కవి వివక్ష వేరుగా నున్నట్లున్నదే. శివాశివపదము వైయాకరణ సమ్మితమైనను శర్వాణీ శర్వులవలె రుద్రాణీరుద్రులవలె లేదు కదా ! అభిప్రాయమగు ఉపోద్ఘాతములో శివాశివ, లీల షష్ఠీతత్పురుషము సమాహితమైనట్లున్నది. కవిగారు తమ మాటలలో దీనిని ప్రస్తావింపక శివాశివలీల యని కంఠోక్తిగా బలుకుటచే, వారికిని తత్పురుషమే యిష్టమైనట్లు గ్రహింపవచ్చును. ఈ పద్ధతి కంటె దీనిని కర్మధారయము చేసినచో శివాశివమైన లీల యనునర్థము సతీదేహత్యాగము మన్మథ దాహము వంటి యశివ లీలలు పార్వతీ వటువుల సంభాషణ, పార్వతీ కళ్యాణము వంటి శివలీలలు, ఇందున్నవని భావించిన సరిపోవునుకదా! కానికవి గారి కభిప్రేతమగు శివాశివ, స్ఫూర్తి యుండదు కదా! శివాశివుల్ని ద్వంద్వం చేసినను 'అశివస్ఫూర్తి పోదుగదా! శివలీలఅంటే గంభీరముగా నుండెడిది. పేరు కవికి గల నవీన మార్గాసక్తిని వెల్లడించుచు.

ఇందలి పద్యములకు సంఖ్యలేదు. ఆశ్వాసాదులకు బదులుగా సంఖ్యావిన్యాసమున్నను; అంతరవిభాగము ముద్రాచిహ్నములగున క్షుత్రములతోనున్నది. ఇంతటి నవీనత వస్తుస్వీకృతిలో గూడ నున్నచో బాగుండెడిది.

వీరిపద్యములలో ధారాశుద్ధి,పదవిన్యాసము, మొదలగునవి మనోహరములైయున్నవి. వీరు మరింతగా మనోహర కావ్యరచన కొనసాగించి సారస్వత సేవ చేయగలరని పాఠకుల లాశింపవచ్చును. గ్రంథాద్యంతములందు గల కవిగారి విశేషములు పాఠకుల నాకట్టుకొనును. పుస్తకం వెల యెక్కువేమో యనిపించును. ఏమైనను కవిగారు మరిన్ని కావ్యములను రచింపగలరని యాసించుటలో అనౌచిత్యము లేదు.

( 9 వ పేజీ తరువాయి )

లాడుటమనము నేర్వవలెను. అట్లు నేర్చిన వానికి ధర్మమును ధరించుచున్న సత్యము తన దర్శనమును, అనుభవమును, అనుగ్రహించగలదు. వ్యాసాది ఋషీంద్రులు, జనకాది రాజర్షులు ఆ అనుగ్రహమును తమ జీవిత క్షేత్రములందు పరిపూర్ణముగ పండించుకొను మార్గము నుపదేశించినారు.

* ఆంధ్రవిశ్వవిద్యాలయమున, తెలుగు శాఖయందు డాక్టరు చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి గారి పర్యవేక్షణలో నేను చేయుచున్న 'తిక్కన భారతము-ధర్మాద్వైతస్థితి, అను పరిశోధనాంశమునకు సంబంధించిన దీ వ్యాసము. వారికి నా కృతజ్ఞతలు.

# సరిగమలు

(సంగీత కవితా సంపుటి)

[రచన: ఎస్వీ. సత్యనారాయణ, ప్రతులకు : హైదరాబాద్ పాత రచయితల సంఘం (హై. పా. ర. సం.) ఇంటి నెంబరు 18-6-867, చాలగంజ్, హైద్రాబాద్-500253. వెల 3 రూపాయలు]

ఈ సంపుటిలో 58 గీతాలున్నాయి. వాటిని 4 రకములుగా విభజించారు. అవి 1) లలితగీతాలు. 2) విరహతాపాలు. 3) నైరాశ్యభావాలు. 4) జానపద బాణీలు.

ఈసరిగమలు (పాటలు)జంటనగరాల్లో చాలా రంగస్థలాలమీద వివిధ గాయకుల గళాల్నించి జనంలోకి ప్రవహించాయి. వీటిలో, కొన్ని ఆకాశవాణి ద్వారా ప్రసార మయ్యాయి. ఎస్వీ వయస్సులో చిన్నవాడైనా విషయాలన్నిక్షుణ్ణంగా ఆకళించుకున్నాడు. ఆయన చక్కని భావాల్ని, చిక్కని భాషలో చెక్కగల రసశిల్పి. నామిత్రుడు ఎస్వీ ; చీకటిసాహిత్యానికి వెలుగునిచ్చే మిత్రుడు. ఆయన చాలాకాలం నుంచి రచనా రంగంలో పరిశ్రమించి, అనేక పుస్తకాలను పరిశీలించి, ఆధునిక సాహిత్యాన్ని మథించి, అనుభవాన్ని, భాషపై అధికారాన్ని, కవిత్వంలో అభినివేశాన్ని సంపాదించుకున్నాడు. అతని కవితలు పెక్కుపత్రికల్లో ప్రచురింపబడినవి. శ్రీ ఎస్వీ. కళాతపస్వి. ఆయన కలమునుంచి ప్రవహించిన కవితాస్రవంతి (సంగీత సంపుటి) 'సరిగమలు' ఈపాటలు అనుభవాల తేటలు.అమృత భావాల ఊటలు. ఈ గీతాలు అనుభూతి జలపాతాలు. ఆంధ్ర సాహితీ నందనవనంలో విరిసి, పరిమళాలు వెదజల్లుతున్న నవపారి

( తరువాయి 15 వ పేజీలో )

# శృంగేరి, కూడలి, అవని పీఠములు

( 1797 నాటి తెలుగు ఒడంబడిక )

అయిదారు వందల సంవత్సరాల క్రిందట శ్రీ శృంగేరి శారదాపీఠ అధిపతిగా నుండినశంకరాచార్యస్వామివారు ఉత్తర భారతదేశములో యాత్రలు చేయడానికి బయలుదేరి కాశి గయ ప్రయాగ బదరీనాథము మొదలైన పుణ్యక్షేత్రాలను దర్శిస్తూ ఆనాడు సరియైన రాకపోక మార్గాలు లేనందువల్ల ఎంతకాలానికీ తిరిగి రాకపోగా శృంగేరీ మఠాధికారులు ఆ కాలంలోని అల్లకల్లోలాలను బట్టి ఆ స్వాములవారు తిరిగిరావడం దుర్లభమని తలచి ఒక సద్బ్రాహ్మణునికి పుస్తక సన్యాస మిచ్చి పీఠాధిపతిగా చేశారు. అటుతరువాత కొంతకాలానికి అసలు స్వాములవారు దేశానికి తిరిగి వస్తూ శృంగేరి సమీపానికి వచ్చేటప్పటికి ఆయనకు సంగతులు తెలిసినవి.మఠానికి కబురంపగా అక్కడివారు తామే నియమించినకొత్తస్వాముల వారిని తొలగించవలసి వస్తుందని భయపడి పాతస్వాములవారి కెదురేగి ధూళి పాదపూజ వగైరాలు చేయడానికి జంకి వెళ్ళలేదు. తమ పదవిని నిలువబెట్టుకోడానికి పాతస్వాములవారికి హక్కు ఉన్నప్పటికిని ఇటువంటి విషయములలో తగవు లాడుట సన్యాసాశ్రమానికి గౌరవప్రదమైన సంగతి కాదని యెంచి ఆయన శివమొగ్గ జిల్లాలో తుంగభద్ర సంగమస్థలమైన కూడలిదగ్గర తమ పీఠమును స్థాపించారు. అంతట ఆచుట్టుపట్లగల అష్టాదివర్ణముల వారు ఆయనకు గురుమర్యాదలు పాదపూజలు జరిగించడం ప్రారంభించారు. ఇదికూడలి మఠచరిత్ర.

మైసూరు సంస్థానంలో హుజూరు అదాలతు కోర్టులో వచ్చిన ఒక వ్యాజ్యముపైని 1847 సం॥ 22 నెంబరుగా దాఖలైన అపీలులో ఈ కూడలి పీఠాధిపతికి అడ్డపల్లకీ వగైరా రాజలాంఛనములు వహించే అధికారము లున్న వని తీర్మానించారు.ఆతీర్పును మైసూరు కమీషనరుగారు 1849 జూను 1 వ తేదీన ఖాయపరచినారు.

కూడలి స్వాములవారు ఎల్లప్పుడూ పర్యటిస్తూ వుండవలె ననిన్నీ శృంగేరీ స్వాములవారు శృంగేరిలోని శ్రీచంద్రమౌళీశ్వరుని, శారదాదేవిని, ఆరాధిస్తూ వుండవలెననిన్నీ పూర్వం క్రోధన ఫాల్గుణ బ ౫ తేదీ ఫర్మానా ఆ కోర్టు తీర్పులో నుదాహరించ బడినది. కూడలిలో పీఠము స్థాపించిన స్వాములవారు కొన్నాళ్ళకు మళ్ళీ రామేశ్వర యాత్రకు బయలుదేరుతూ పూర్వం కాశీ యాత్రకు వెళ్ళినప్పుడు జరిగిన విపత్తు వంటిది మళ్ళీ సంభవించకుండా కూడలిలోని తమ శిష్యులలో నొకరిని తమ యాత్ర కాలములలో కూడలి చుట్టుపట్ల సంచారము చేయవలసిన దని ఆజ్ఞాపించారు. స్వాములవారు రామేశ్వర యాత్ర చేసి కంచి కాళహస్తి తిరుపతి మొ॥ ఇతర క్షేత్రాలను కూడా దర్శించి మైసూరులోని కోలాహర పురి అను కోలారును చేరుకున్నారు. కోలారు దగ్గర శతశృంగ పర్వతము దగ్గర అంతరగంగ అనే ప్రదేశము తపస్సుకు చాలా యోగ్యముగా కనబడి నందువల్ల అక్కడ నొక మఠమును స్థాపించారు. కోలారు కేవలము తెలుగుజిల్లా. శృంగేరీ స్వాములవారు కన్నడము నందే గాక సంస్కృతాంధ్రము లందును పండితులు. ఈ క్రొత్త మఠము రెండు శతాబ్దముల పాటు వర్ధిల్లినది గాని మహమ్మదీయ ప్రభుత్వ కాలము నాటి రాజకీయ పరిస్థితులవల్ల ఈ పీఠమును ఇప్పుడు ఆవని అని పిలువబడుచున్న అవంతి క్షేత్రమునకు తరలించారు. ఇక్కడనే వాల్మీకి ఆశ్రమ ముండెనని సీతాదేవికి లవకుశులు జన్మించినారని ఐతిహ్యము. అప్పటి నుండి అవని పీఠము వర్ధిల్లు చున్నది.

## క్రి. శ. 1797 సం॥ అపూర్వలేఖ.

శ్రీ విద్యాశంకర

సంపాదకులు : శ్రీ దిగవల్లి వేంకట శివరావు, బి. ఏ; బి. ఎల్.

శ్రీ స్వస్తిశ్రీ శాలివాహన శకాబ్దంబులు ౧౭౧౯ అగు వర్తమాన పింగళ నామ సంవత్సర ఆశ్వయుజ బ॥ ౧౦ ఆదివారం నాడు.

శ్రీమత్పరమహంస పరివ్రాజ కాచార్య శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యాణ అధిష్ఠాన సింహాసనాభిషిక్త శ్రీ కాంచి కామకోటి పీఠాధిప శ్రీమహాదేవ సరస్వతీ శ్రీస్వాములవారి మఠానకు.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీగెంరి శారదమఠస్థిత శ్రీభగవత్పాదాచార్యాణం కరకమల సంజాత ఆమనీక్షేత్రస్థిత శ్రీ అభినవోద్దండ విద్యారణ్య భారతుల వారు

ఇచ్చిన వడంబడిక చీటి. అనగా మేము గంగా స్నానం చేసుకుని తమ సంచార ప్రదేశములైన త్రిశిరపురం చేరిన అఖండకావారి తీరములో తొడ్యం, ముశిరివిడ్డ, కర్తశీమ, అగ్రహారములలో మా మఠం ముద్రకర్త తమ అగ్రహారం మహాజనములను దండన ఖండన అపరాధములు, ఆచార వ్యవహార ప్రాయశ్చిత్తములు అగ్రతాంబూల సన్మానములు భిక్షా పాద పూజ కట్టుబడులు గ్రామ ప్రతిగ్రామములలో వివాహోపనయ నాదులకు యంత్ర మాత్రం తూకలు కట్టుములు చేసి ముచ్చలకాలు తీసుకుని అమర్యాదలు చేసి

నారని తమకు వినుకపై తాము శిష్యులకు శ్రీముఖాలు పంపించ్చినందున అభిగమన సన్యాసాలున్నూ భిక్షా పాదపూజలు కష్టములు చాయవద్దని ఆజ్ఞాపించినందున మాగక్షా నిరోధం చెశివున్నారు. గనుక్కా యిప్పుడున్నూ మాకు సేతు స్నానాది యాత్రలు చాయవచ్చినారం కాని తమ సంచ్చార ప్రదేశముల యందు శిష్యాజక్షా నకు వచ్చిన వారం కాము.

అఖండ కావేరి తీరములో ఆజ్ఞాపరాధములు తీసిన రూకలూ ముచ్చిలకా చీట్లు తమకు యిచ్చినాము గనుక యితఃపరం సేతూ యాత్రె పొయ్యేటప్పుడు గ్రహస్థులు పూజచేసిన మాత్రములలో సంతోషించి పొయ్యేవారం. కొత్తకోడా మధుర తిన్నవెల్లి (అనంత) శైనం రామేశ్వరం రామనాథపురం శివగంగా మొదలైన యిసుపాగ్రామములలో ఆతాలూకా శీమలలో ఆజ్ఞాపరాధములు, ఆచార వ్యవహార ప్రాయశ్చిత్తములు అగ్రతాంబూలాదులు మొదలైన స్వాతంత్ర మర్యాదలు మేము ఆ దేశాలతో నడిపించ్చేది లేదు. సేతూయాత్ర చేసుకుని మా ప్రదేశముకు పోగలవారము. శ్రీ శ్రీ మఠం పారు పత్యరుజు.

(పారసీ భాష లిపిలో ఒక పంక్తి యున్నది.)

ముద్రకర్త అనగా ఆ యా గడి స్థలములలో నుండే ఉద్యోగి.

పారుపత్యమనగా అధికారము

---

**Copied from the Photostat plate in "Preceptors of Adwaita" Volume published on the 60 th year of the Kamakoti Sankara Charya. Chandra Sekhara Bharati Swami.**

ఈ అపూర్వమైన తెలుగు పత్రము యొక్క అసలు ప్రతి శ్రీకంచి కామకోటి శంకరాచార్యపీఠములో నున్నది. దాని ఫొటో చాయాచిత్ర ప్రతిని శ్రీ చంద్రశేఖర భారతి స్వాములవారి షష్టిపూర్తి సందర్భములో అద్వైత వేదాంతులను గూర్చిన ఇంగ్లీషు సంపుటములో ముద్రించిన దానికి భూత అద్దము సహాయముతో నకలు వ్రాసుకొన్నాను.

ఇది మన ఆంధ్రదేశ చరిత్రకు, భాషకు వాఙ్మయ చరిత్రకు ఉపయోగింపగల లిఖితాధారములలో నొకటి.

దిగవల్లి వేంకటశివరావు

---

( 13 వ పేజీ తరువాయి )

జాతాలు. ఈ గేయాలు ఆనందమందారాలు; సరిత్సంగీతాలు, సవిత్కిరణాలు.

అభ్యుదయ రచయితల సంఘంలో సభ్యుడుగా ఉండి, అనేక నాటకాలు, నాటికలు, సంగీత రూపకాలు వ్రాసి, మంచిపేరు గడించారు. ఈ సరిగమల్లులో అన్వయ సంక్లిష్టత గాని, అస్పష్టత గాని లేవు. మసృణ మంజులంగా, మాధుర్య ధుర్యంగా, లయబద్ధంగా, రచించారు. డా। గోపాలకృష్ణారావు, గారన్నట్లు "వయసులో చిన్న అయినా అనుభూతిలో మిన్న". కవితలు వ్రాయడం, నాటకాలు వ్రాయడమేకాక, పాటలూ వ్రాయగల నని ఋజువు చేశారు. ఈ గీతాలు హాయిగా పాడుకో వచ్చు. గానగుణం అధికంగా గల కమ్మని గీతాలు. గీతాలు నవరస భరితాలు. ఒక్కొక్క గీతం ఒక్కొక్క రసగుళిక.

ఈ పుస్తకాన్ని హై. పా. ర. సం. ప్రచురించడం అభినందనీయం. ఈ మధురమైన పాటల్ని ఒక సంపుటిలో చేర్చి గాయక లోకానికి అందించిన వారి కృషి ప్రశంసనీయం. హై. పా. ర. సం. వారి తొలిపుస్తకం ఇది. వారు అనేక ఉత్తమ రచనలను ప్రచురించాలని కోరుతున్నాను. శ్రీ ఎస్వీ. తనపాటల్లో ప్రకృతికి రమణీయంగా దర్పణం పట్టాడు. సొంత శైలిని సంతరించుకొని, క్రొత్త బాణిలో, క్రొత్త వాణిలో ఉత్తమంగా, ఈపుస్తకాన్ని మలిచారు. ఈ పాటల్లో భావసౌకుమార్యము, సరళత, స్పష్టత, విశేషంగా ఉన్నాయి.

సాహిత్యం ఆహారంగా, సంగీతం పానీయంగా, లలితకళలు కుటీరంగా, జీవించే కళాతపస్వి శ్రీఎస్వీ. రసరంగ సాహితీసాగరుడు, రాగగగన సుధాకరుడూ అయిన ఆయన కలం నుంచి ప్రవహించిన పీయూషలహరి, సంగీతఝురి; మధురిమలు పంచే ఈ 'సరిగమలు'.

ఈ పాటలు పుస్తక రూపంలోరావాలని చాలామంది గాయకులు కోరుకోవడం వల్ల పుస్తకరూపం దాల్చాయి. ఆపుస్తకాన్ని అ. ర. సం. ప్రచురించ డానికి ముందుకు వచ్చింది. శీ. లా. వి. ముఖచిత్రం భావస్ఫోరకంగా, రమణీయంగా చిత్రించారు. శ్రీ ఎస్వీ.యువకుడు, మంచి భావుకుడు, భాషా సంపన్నుడు. అతని కవితలో ఒక వొడుపు.ఊపు ఉన్నాయి. ప్రతీ గేయంలోను భావం హాయంలా పరుగెత్తుతుంది. ఆయన గేయాలు వీనుల విందై, అమృతపు సోనల పొందైన వని చెప్పటంలో సందేహం లేదు. చెప్పదల్చుకున్న విషయాన్ని సూటిగా చెప్పడం, పఠితల్ని ఆలోచింప చేయడం, సమస్యలకు పరిష్కారంచూపటం, అతని కవితకు విశిష్టత కలిగించాయి. ప్రతీ రచనలోను వైశిష్ట్యము, వైవిధ్యము,ఉంటాయి. అతని ప్రత్యేకత నిత్యనూతనత.

ఈపుస్తకం ముఖ్యంగా గాయకులకు ఎక్కువ ప్రయోజనకారి. ప్రతి గాయకుడు కొని పాడుకోవల్సిన పుస్తక మిది. ఇంతకు మించి చెప్పవలసినదిలేదు.

— శ్రీ రత్నశ్రీ

# శ్రీమద్భగవద్గీత - అనుబంధము

( ఆంధ్ర తాత్పర్య వివరణ సహితము )

(18 వ సంచిక తరువాయి)

వివరణకర్త : శ్రీ కె. ఎల్. నారాయణ.

అ. 8 శ్లో 11 B

మనుతేయ న్న మనసా
యేనాహుర్మనో మతమ్
తదేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదం య దిద ముపాసతే

అక్షర పరబ్రహ్మము మనస్సుతో ఊహింప వీలులేనిది. మనస్సు తనమనన కార్యమునందు అక్షర పరబ్రహ్మమువల్లనే ప్రవర్తించుచున్నది. (కాబట్టి తన నియామకునే నియమించు శక్తి మనస్సునకు లేదు) మనస్సును మననమునందు నియమించు శక్తియే అక్షర పరబ్రహ్మమని గ్రహించునది. కాని మనస్సుచే 'నిది'యని యుపాసించునది బ్రహ్మముకాదు.

అ. 8 శ్లో 11 C

య చ్చక్షుషా న పశ్యతి
యేన చక్షూంషి పశ్యన్తి
త దేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదం య దిద ముపాసతే

అక్షర పరబ్రహ్మము కంటితో చూచుటకు వీలులేనివాడు; అక్షర పరబ్రహ్మము వల్లనే కన్ను చూచుచున్నది. (కాబట్టి తన నియామకునే నియమించు శక్తి కంటికిలేదు) కన్నును చూచుటయందు నియమించుశక్తియే బ్రహ్మమని గ్రహించునది, కాని, కంటితో 'నిది' యని చూడబడినది బ్రహ్మముకాదు.

అ 8 శ్లో 11 D

శృణోతి య న్న శ్రోత్రేణ
యేన శ్రోత్ర మిదం శ్రుతమ్
త దేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదం య దిద ముపాసతే

అక్షర పరబ్రహ్మము చెవితో వినుటకు వీలులేనివాడు, ఆయన వల్లనే చెవి వినుచున్నది (కాబట్టి తన నియామకునే నియమించు శక్తి చెవికిలేదు) చెవిని వినుటయందు నియమించునదియే బ్రహ్మ మని గ్రహించునది. కాని, చెవులతో 'నిది'యని వినబడునది బ్రహ్మము కాదు.

అ. 8 శ్లో 11

ప్రాణీతి య న్న ప్రాణేన
ప్రాణం ప్రాణీయతే యతః
త దేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదం య దిద ముపాసతే

అక్షర పరబ్రహ్మము ప్రాణప్రసారము గలవాడుకాదు, ప్రాణమును శరీరమున ప్రసరింప జేయును. (తన నియామకునే నియమించు శక్తి ప్రాణమునకు లేదు), ప్రాణమును ప్రసారమున నియమించునది బ్రహ్మమని గ్రహించునది, కాని, ప్రాణముచే 'నిది' యని యుపాసించు నది బ్రహ్మము కాదు.

అ. 8 శ్లో 11

ఏత ద్ధ్యే వాక్షరం బ్రహ్మ
ఏత దే వామృతం పరమ్
ఏత దే వాభయం జ్ఞాత్వా
యో య దిచ్ఛే త్త దాప్నుయాత్

ఇట్లు వాగింద్రియమునకు వాక్కు, మనస్సునకు మనస్సు, కంటికికన్ను చెవికి చెవి, ప్రాణమునకు ప్రాణము; అయినదే అక్షర పరబ్రహ్మము. అదియే (దేనినిపొందిన తిరిగి వచ్చుట లేదో అట్టి) పరమ పదము, అదియే నాశనరహితము. ఇట్టి అక్షర పరబ్రహ్మము నెఱిగినవాడు సకలాభీష్టముల నందును. పరమ పురుషార్థమగు మోక్షము నందు నని వేఱుగ జెప్పవలెనా ?)

అ. శ్లో 11 జి

ఏత దాలంబనం శ్రేష్ఠ
మేత దాలంబనం పరమ్
ఏత దాలనబనం జ్ఞాత్వా
ప్రాప్నోతి పరమాం గతిమ్

అట్టి అక్షర పరబ్రహ్మాశ్రయము ఉత్తమము, అంతకు మించినఉత్తమాశ్రయము లేదు. ఇట్లు అక్షర పరబ్రహ్మాశ్రయము ఉత్తమోత్తమ మని తెలిసినవాడు (తెలిసి ఆశ్రయించువాడు) పరమపదమునొందును.

అ. 8 శ్లో 13 ఎ

త దేత దక్షరం బ్రహ్మ,
స ప్రాణో వాఙ్మనశ్చ సః
తత్సత్య మమృతం చైవ,
తద్విద్ధి భరతర్షభ

ఓ అర్జునా ! ఓంకారమే అక్షర పరబ్రహ్మము, అదియే ప్రాణము, వాక్కు, మనస్సు, భూత భవిష్య ద్వర్తమానముల జాగృతి, స్వప్న సుషుప్తుల నుండునది, అమృతత్వము నిచ్చునది. యని తెలిసికొనుము.

అ. 8 శ్లో 13 బి

ప్రణవో ధనుః శరో, హ్యాత్మా
బ్రహ్మతల్లక్ష్య ముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం
శరవత్తన్మయో భవేత్

ధనుస్సున బాణము సంధించి, ఏకాగ్రతతో లక్ష్యమును గురి చూచి వదలిన బాణము లక్ష్యమును గలియును. ఓం-కార మను ధనుస్సున ఆత్మ యను బాణమును సంధించి ఏకాగ్రతతో బ్రహ్మమను లక్ష్యమునగురియుంచినచో ఆత్మ బ్రహ్మమునందు విలీన మగును.

అ. 8 శ్లో 13 సి

ధను గృహీత్వౌప మిదం మహాస్త్రం
శరం హ్యుపాసా నిశితం విధాయ
ఆయమ్య తద్భాగవతేన ధీరో
లక్ష్యం తదేవాక్షర మిత్యవేహి

ఓం-కారమను గొప్పవిల్లు చేబూని, బ్రహ్మోపాసనతో తేజోవంతమైన ఆత్మ-శరమును సంధించి, నిశ్చలముగ వంచిపట్టి ధీరుడైనవాడు అక్షర పరబ్రహ్మమను లక్ష్యమునుతప్పక విడువ వలయును.

( సశేషం )

Regd. No. H/Rmy-42.

## 1978 - 79 నోట్సు

| | | | | |
|---|---|---|---|---|
| * 1 | ఖడ్గనారాయణము | బి. ఏ | మోడరన్ పొయెట్రీ | 3 — 00 |
| * 2 | సాహితీ సాక్షాత్కారము | ,, | ప్రోజు | 3 — 50 |
| * 3 | మహాసేనాని | ,, | నాన్ డిటైల్డు | 2 — 75 |
| * 4 | షట్పది | బి. కాం | ప్రోజు | 7 — 00 |
| * 5 | నాయకరాజపర్వము | ,, | మోడరన్ పొయెట్రీ | |
| 6 | రమణీ ప్రియదూతిక | ,, | నాన్ డిటైల్డు | 2 — 75 |
| * 7 | ఆంధ్రప్రశస్తి | బి. ఎస్. సి | మోడరన్ పొయెట్రీ | 3 — 00 |
| * 8 | మన సంస్కృతి - మన సాహితి | ,, | ప్రోజు | 3 — 50 |
| * 9 | సావిత్ర్యుపాఖ్యానము | బి. ఏ. | ఓల్డు పొయెట్రీ With TEXT | 3 — 50 |
| 10 | స్వప్నవాసవదత్తము | ,, | క్లాసికల్ డ్రామా | 3 — 00 |
| 11 | సుభద్ర | ,, | మోడరన్ డ్రామా | 2 — 50 |
| *12 | ఖడ్గనారాయణము Same as 1 Year | ,, | మోడరన్ పొయెట్రీ | 3 — 00 |
| *13 | సౌపర్ణోపాఖ్యానము | బి. కాం | ఓల్డు పొయెట్రీ With TEXT | 7 — 00 |
| *14 | నాయకరాజ పర్వము | ,, | మోడరన్ పొయెట్రీ | |
| 15 | ప్రతిమ | ,, | క్లాసికల్ డ్రామా | 3 — 00 |
| *16 | బలరామ విజయము | ,, | మోడరన్ డ్రామా | 3 — 00 |

* ఈ గుర్తుగల నోట్సు ముద్రణ పూర్తియై కాపీలు సిద్ధముగా నున్నవి.
మిగిలిన పుస్తకముల నోట్సు అతిత్వరలో ప్రచురింపబడును.

6 - 7 - 8, ఇన్నీసుపేట

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.